# సర్దార్
# పృథ్వీసింగ్

భారత విప్లవవీరుడు

(జీవితచరిత్ర)

రచయితః—

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి

పబ్లిషర్సు:

శాస్త్రి అండ్ కో

రాజమండ్రి.



[వెల 0—10—0

# మనవి

ఈనాడు భారతదేశప్రజానీకమంతా సహృదయంతో వాంఛించేది సంపూర్ణస్వాతంత్ర్యమని జగద్విదితము. ఆస్వాతంత్ర్యాకాంక్షలో నెంత సత్యశాంతాహింసలున్నా విప్లవ బీజాలు పెల్లుబుకుతున్నమాట వాస్తవం. ఇది కాదన వీలు లేదు. అనలేము. అయితే, ఆభారతీయవిప్లవస్రవంతి నరికట్టడమా? లేక దోహద మివ్వడమా అనే ప్రశ్న పెద్దలహృదయాలలో ఊగిసలాడుతోంది. భారత ప్రజాయువకమండలి మాత్రము విప్లవఝురీవేగమున నీదులాడ నువ్విళ్లూరుచున్నది. దాని నడ్డుటకు పరమేశ్వరునకుదక్క నన్యులకు సులభసాధ్యము కాదు. నేటి భారతరాజకీయవాతావరణ పరిస్థితుల ననుసరించి భారతయువకులను విప్లవమునకు ప్రోత్సహించుటయే సవ్యమైనమార్గమని కొందఱు తలంచుచున్నారు. అట్టి ప్రోత్సాహము నినుమడింప చేయవలెనన్న ఆధునిక భారతవిప్లవవీరుల జీవితముల భారతయువకుల హస్తపద్మముల నలంకరింపజేసి, యందలి సువ్యక్తబీజముల వారిహృదయసీమలందు సుప్రతిష్ఠితములగునట్లు చేయవలెను. ఈయాశయమునే హృదయమున నిడికొని నేటి భారతవిప్లవ వీరశిఖామణియగు పృధ్వీసింగు జీవితము నందలి విప్లవఘట్టములు నన్నిటిని సేకరించి సంధానించితిమి. ఈజీవితములోని విప్లవతరంగముల గొన్నిటినైన భారతీయయువకమండలి గ్రహించి జీర్ణింప జేసికొనెనేని దేశము, దేశచరిత్రము, రచయిత, ప్రచురణకర్త ధన్యు లగుదురు.

ఇట్లు,

మ. ల. న. శాస్త్రి.

విప్లవశబ్దము శబ్దశాస్త్రముతోనే జన్మించినది. దానికిని నైఘంటికములందు మహోత్కృష్టస్థాన మున్నది. ఉండవలసినదే, విప్లవకారులు భరతఖండమందేమి, ఇతరఖండములందేమి సర్వకాలసర్వవస్థలందును, అఖిలపరిపాలకుల యేలుబడులందును బహిరంగముగనో, అంతర్భూతముగనే ఉన్నారనియే యంగీకరించితీరవలెను. విప్లవకారు లుందురను విషయము సామాన్యజనమందలి కొంతభాగమునకైనను దెలియపీలున్నదేమోకాని, వారివర్తనాదికము తెలియుంగుట కవకాశములు తక్కువ. వారిజీవితములే నిబిడరహస్యపరివృతములు. అట్టివానిని జనసామాన్య మెఱుంగదగునని సాహసముతో బలుకవచ్చును. అందులకు విప్లవమార్గదర్శకులజీవితములు ముఖ్యముగ పఠనీయములు. ఆజీవితములలో సాధ్యమగునంతవఱకు విప్లవమునకున్యాయకారణము లుండవలయును. అట్టిజీవితములలో భరతఖండమున దశదిశలకు బ్రాకియశోవల్లికల నందినయొకమహావిప్లవవీరుని చరితమును చదువరు లిపుడు చదువబోవుచున్నారు. ఆభారతవిప్లవవీరుడు సర్దార్ పృథ్వీసింగ్, చూచితిరా? ఆపే రెంతభయంకవిని మయాక్షరములతో నావృతమై కేవలము నాలుగువర్ణములతో నొప్పినను గంభీరముగను, దృఢతరముగను, విశీర్ణముగను, జవకలగలదిగనున్నదో, అంతయు నట్లున్నదా? లేదే! ఆతందియక్షరము లెంతసునిశితముగను, సున్నితముగనునున్నవో పరికింపుడు,



"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

## జ న న ము

భారతదేశంలోని రాజపుత్రవంశాలనంతధైర్యసాహస గంభీరోపేతములని దేశచరిత్ర యేకొంచెము తెలిసినవాడికైనా తేటతెల్లమే. అందులో బాగా రాజపుటానాపస యెరింగిన వారు మహమ్మదీయచక్రవర్తులు. రానురాను బ్రిటిషుప్రభువులకుగూడా అది అవగతమే అయింది. పంజాబురాష్ట్రం నిర్వక్రపరాక్రమోపేతులైన భుజబలశాలురకు పుట్టినిల్లు. ఆరాష్ట్రంలో ప్రవహించే అయిదు ఉపనదులతో గలిసిన సింధునది యొక్క జలప్రభావమేమో? ఆరాష్ట్రంలో పాటియాలాసంస్థానం మేటికిరీటంలాంటి దంటారు. దానికి దగ్గఱగావుండే అంబాలాకంటోన్మెంటునుండి సిమ్లాకుపోయే యినపదారిలో 'సారక్ పూర్ తాబక్' అనేపల్లెలో 'షాదీరామ్' అనే రాజపుత్రవంశీయుడైన పేదరైతునకు 1892 వ సంవత్సరంలో 'పృథ్వీసింగ్' ప్రథమపుత్రుడుగా జన్మించాడు. అతడు పుట్టినవేళావిశేషమెట్టిదో తెలియదుగాని యతని భారతస్వాతంత్ర్యవాంఛాదీక్షను చూస్తే తొలిజన్మలో అతడొక మహనీయుడై వుండాలి. షాదీరామ్‌కు పృథ్వీసింగ్ కాక మరొకసంతానంమాత్రమే వుంది

షాదీరామ్ చాలాపేదవాడు. అయినప్పటికీ పరువుమర్యాదలు నిలుపుకోడంలోను, గౌరవాన్నిచ్చిపుచ్చుకోడంలోను పేద కాడు. తెక్కలవల్లనే కుటుంబాన్ని గౌరవంగా పోషించు కుంటూ వస్తున్నాడు.

ఒక్కరీతిగా దినములు గడవటం యెంతకష్టం! పాపం షాదీరామ్‌కు చెడ్డరోజులు వచ్చాయి. అప్పటిదేశపరిస్థితి ఒక మారు సింహావలోకనం చేద్దాం. అప్పటికి 35 ఏండ్లక్రిందట అనగా 1857 లో సిపాయివిప్లవంజరిగింది. అందులో పరాజిత మైంది. అయితే ప్రజావిప్లవంవస్తే సామ్రాజ్యరక్షణ కెంత యత్నం చెయ్యాలో, ఎన్నితికమకలు పడాలో, ఎంత కష్ట పడాలో బ్రిటిషుసామ్రాజ్యవాదులు తెలుసుకొన్నారు. దానికి రక్షణసాధనాలను, సైన్యసన్నాహాలను, కట్టుదిట్టాలను చేసు కోటం మొదలెట్టారు. అందుకోసంగానూ, తమసరకులను సునాయాసంగా భారతదేశంలో దింపి విరివిగా లాభాలు సంపాదించడానికీగాను, మనదేశంలోని ముడిపదార్థాలను స్వదే శంలోకి చేర్చడానికిగాను రైలుమార్గాలను వేసారు.

అప్పటికి మనదేశంలోని చేతిపరిశ్రమలేగాక తదితర పరిశ్రమలుకూడ మహోన్నతస్థితిలో నున్నాయి. క్రమంగా తమలాభాలకోసం వేసిన యినుపదారులద్వారా సీమనుంచి వస్తువులను దింప నారంభించారు. ఆవిదేశవస్తువులతో పోటీకి నిలవలేక మనదేశంలోని లోకఖ్యాతమైన ఢక్కామల్లునేత

మగ్గాలు, బంగాళములోని పట్టుదువ్వాలువనేత, అస్సాములోని మరఫిరంగుల పరిశ్రమలవృత్తి మున్నగునవి వెనుకపడ్డాయి. రాట్నంబుల ఆరాటంబులు సన్నగిల్లినవి. ముసలమ్మలపనులు మూలబడ్డాయి. నేతమగ్గాలసంగాతము అరుదయింది. సాలె జాంద్రల పాట్లలు సన్నగిల్లినవి. కొలిమితిత్తిదుకాణాలు కూల బడ్డాయి. కమ్మరులనోట మట్టిబడ్డది. పరిశ్రమలనాశనమూ లంగా కూలిసాలిజనము కుంగిపోయి కూటికే కరువయింది. క్షామదేవత దేశరంగమున నిలిచి ప్రళయతాండవ మాడినది. నిరుపేదలైనప్రజలు తమదేశంలో బ్రతుకుతెరువులేక కూలికై యాలిబిడ్డలతో కానిభూములకు బోయిరి.

షాదీరాం కరుదాటి కాగలేక భార్యను, పృథ్వీసింగును మరోపసిబిడ్డను తాతగారిచేతుల్లోపెట్టి బర్మాకు వలసవెళ్ళాడు. కొలదిదినములలోనే పృథ్వీసింగుతల్లి క్షుత్తు కాగలేక మరణిం చినది. పిల్లల నిద్దరిని తాతగారే చూస్తున్నాడు. సింగుకు నలుగురు మేనమామలు. వాళ్ళంతా రాత్రిళ్ళు తుపాకీవేటకు పోయేవారు. సింగుకూడా బళ్ళెం చేతబట్టి వాళ్ళతో పోయే వాడు. ఈఅలవాటువల్ల నతనికిబాల్యములోనే ధైర్యసాహసా లలవడ్డాయి. అయితే చదువుసంధ్య లబ్బలేదు. సింగుమేన మామలలో వొకడు ఆకలిబాధకు తట్టుకోలేక తానుకూడా బర్మా పోయాడు. పోలీసుగుఱ్ఱపుదళంలో చేరి బాగా ఆర్జిం చుకొనేవాడు. షాదీరాం పాలవర్తకం చేసేవాడు. అతని

వ్యాపారం దినదినాభివృద్ధి నందుతోంది. పాదీరాం పృధ్వీ సింగునుబడిలోకి పంపవలసినందని మేనమామలకు రాస్తే ఒక పాఠశాలలో ప్రవేశపెట్టారు. ఒకయేడాది గడిచేసరికి బర్మా లోవున్న మేనమామ స్వగ్రామానికి వచ్చాడు. తిరిగి బర్మా వెళ్ళేటపుడు తనమేనల్లుళ్ళను వెంటదీసికొనిపోయి తండ్రి వద్దను చేర్చాడు.



## విద్యాభ్యాసము.

'చ. నరులకు దాచిపెట్టిన ధ
 సంబుమ చిక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్యసుఖ
 కారిణీయుఁ గురుకోటికిన్మహా
గురువు విదేశబంధువును
 గూర్చినదైవము రాజవశ్యముఁ
వెరపు సువిద్యయే ధరన
 విద్యుఁడె పో పశు వర్గ మిట్టిదే.'

పృధ్వీసింగ్ బర్మాలో తండ్రిని కలిసేటప్పటికి తన దేశంలో చదివిన చదువు చాలాతక్కువ. కానైతే అతనికి

విద్యాసక్తి అధికమే. పాఠశాలలో చేరేసరికి కొంచెం వయస్సు ముదరటంవల్ల క్లాసులో పెద్దవాడుగా కనిపించే వాడు. ఆకారణంచేత సిగ్గుపడేవాడు. బర్మాలో షాదీరాం పాలవ్యాపారం బాగా సాగుతోంది. ఆర్జనకూడా బాగావుంది. కాని కొడుకును చదువులో పెట్టడమూ లేక తనవ్యాపారంలో సాయంగా తీసుకోవడమూ అనే ప్రశ్న వచ్చింది. కొడుకు నడిగితే చదువుకుంటా నన్నాడు. వెంటనే తండ్రి 'మనేయ్యా' లోని మిషన్‌పాఠశాలలో కొడుకును చేర్పించాడు. అప్పటికి సింగుకు ఇంగ్లీషురాదు. బర్మాభాష మరీకొత్త. అంచేత పాఠాలు అర్థమయ్యేవి కావు. ముందు బర్మాభాష కష్టపడి నేర్చాడు. చదువులో చురుకుదనం ప్రారంభమైంది. బడి వద లడంతో సింగ్ ఆటపాటలకుపోక యింటికొచ్చి యింటిపను లలో తండ్రికి సాయం చేసేవాడు. షాదీరాం మతవిశ్వాసం కలవాడవడంచేత బౌద్ధసన్యాసులతో కలయికగా ఉండేవాడు. వారిమీద భక్తి చూపేవాడు. అదే సింగుకు అలవడింది. అప్పుడప్పుడు సింగ్ మతధ్యాసచే భగవత్ప్రార్థనలు చేసే వాడు.

ఇంతలో 1907 లో పంజాబునాయకుడైన లాలా లజ పతిరాయిని యింగ్లీషువారు పట్టుకొని మాండలేజైలుకు పం పారు. దేశమంతా కల్లోలం బయలుదేరి యది బర్మాకూడా పాకింది. అప్పటికి పృథ్వీసింగ్ నాలుగోఫారం చదువు తున్నాడు. పంజాబునాయకుని ప్రవాసమతని చెవినిబడేసరికి

ఉద్రేకితు డయ్యాడు. కాని కొంతసహాసం చూపాడు. ఎం చేతనో సింగ్‌కు తనదేశంలో చదువుకోవాలనిపించి తండ్రి అనుమతిపొంది స్వగ్రామం చేరాడు. అక్కడనుంచి అంబా లానగరంవచ్చి బోర్డింగ్‌స్కూలులో 5 వ ఫారంలో చేర తల చాడుగాని హిందీ, ఉర్దూభాషలు రానికారణంచేత 4 వ ఫారంలోనే చేరవలసివచ్చింది. ఒక యేడాదిలో కష్టపడి చదివి 4, 5, 6 ఫారాలు పూర్తిచేసి తర్వాత రాజపూర్‌పాఠశా లలో చేరాడు. అంతట్లోకే తండ్రిదగ్గరనుంచి డబ్బు రాకపోవ డంచేత తండ్రి చిక్కులుపాలయ్యాడా అనే ఆందోళన పుట్టి తిరిగి బర్మాకు ప్రయాణమై తండ్రిని చేరాడు. చదువుమాన వద్దని, వ్యాపారం పాడైందని, ఇళ్ళు అమ్మైనా చదివిస్తానని నచ్చచెప్పాడు. కాని పృథ్వీసింగ్ వినక పోస్టాఫీసులో గుమా స్తాగా చేరాడు. అప్పటి కతనివయస్సు 20 ఏండ్లు. మంచి యౌవనకళ తొలుకాడుతోంది. తండ్రి పెళ్ళి చెయ్యాలని యత్నించాడు. సింగుకు ఆధ్యాసలేదు. ఏకారణంచేతనో నిరం తరం అసంతృప్తిగా వుండేవాడు. ఏకాంతవాసం కోరేవాడు. అంచేత ఆరోగ్యం పాడయింది. ఉద్యోగం విడిచిపెట్టాడు. తనమాతృదేశపు బానిసశృంఖలాలు తెగగొట్టడానికి జీవితం ధారపొయ్యాలి అనే సమస్య అతనిని వేధింపసాగింది.

షాదీరాం కుమారునిపరిస్థితులు చూచి నాకేవిధం గాను వీడు పనికివచ్చేలా లేడని స్నేహితులతో అనేవాడు. ఒకమిత్రుడు నీకొడుకు నేదేనా, ఆరోగ్యప్రదేశానికి పంపడ

మత్యవసరమని సలహా యిచ్చాడు. అప్పటికప్పుడే పృధ్వీసింగుకు దేశభక్తులమధ్య కరికి దేశసేవ చెయ్యాలనే సంకల్పం దృఢపడిపోయింది. పాదీరాం కొడుక్కి వందరూపాయిలిచ్చి ఆరోగ్యం బాగుచేసుకొమ్మని బ్రతిమాలాడు.

# 3

## ప్రపంచపర్యటనము

శా. ఆరంభింపరు నీచమానవులు వి
ఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురట వి
ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోద్యాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగించరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్.

పృధ్వీసింగ్ తండ్రిమాట వినడం-తన ఉద్దేశం కొనసాగుతుందనే ఊహతో ఎగిరిగంతేసి డబ్బుతీసుకొని బయలుదేరి ఆరోగ్యప్రదేశం ఊసే మెత్తకుండా రంగూనుచేరాడు.

అంతాకొత్త. ఎక్కడికివెళ్ళాలో నిశ్చయంలేదు. ఇద్దరుపంజాబీ యువకు లుద్యోగంకోరకు తిరుగుతూ కనిపించి యితణ్ణికూడా రమ్మన్నారు. నాకిష్టంలేదని వాళ్ళనివిడిచి చైనాకు పోదామని నిశ్చయించి మలయాలోని 'పెనాంగు'కు టిక్కెట్టుతీసి ఓడెక్కాడు. ఆ ఓడలో ఒకఉద్యోగి కలిసాడు. అతడు మలయా, హాంకాంగ్ లలోని భారతీయులకష్టాలు తెలిపాడు. దాంతో అతని దేశభక్తి ఆవేశపూరితమైంది. పెనాంగ్ లో దిగాడు. అక్క డయాచితంగా ఉద్యోగంలభిస్తుంది. సింగుకా ఊసేలేదు. అక్కడనుంచి సింగపూరుచేరాడు. అక్కడా ఆగక వెంటనే హాంకాంగుకు ఓడెక్కాడు. మంచి ఎండాకాలం. ఎండధాటికాగలేక ఓడలో చావులు. అంతలోనే తుపాను ఆరురోజులకు చేరవలసింది 15 రోజలు పట్టింది. ఆ తుపాను సమయంలో సింగ్ బెడ్డింగువగైరా సముద్రంపాలయ్యాయి. ఎలాగైతేం మిగిలిన ట్రంకుమాత్రం పుచ్చుకొని హాంకాంగులో ఓడదిగాడు.

అక్కడ సిఖ్ఖుగురుద్వారంలో బసపెట్టాడు. కాని ఎవడో డబ్బుచెక్కేసాడు. చేతిలో ఏగాణిలేదు. పనికోసం తిరిగాడు. లాభం కనిపించలేదు. అంతలో పంజాబీలు, దేశభక్తులు అయిన బల్వంతసింగ్, ప్యారీలాల్ అనేవారితో పరిచయం కలిగింది. వా రమెరికా వెడుతున్నారు. కాని వాళ్ళ దగ్గిరా డబ్బులేదు. పస్తులుంటున్నారు. పృథ్వీసింగుకు అచటి భారతసిపాయీలతోను, రాజపుత్రసిపాయీలతోను స్నేహం

కుదిరింది. వారు సింగును రోజూ భోజనానికి పిలిచేవారు. వెళ్ళేవాడు. కాలం గడిచిపోతూంది. ముందు సంగతేమా అనే అతని ఆలోచన. ఆ సమయంలోనే చైనాలో ప్రజాస్వామిక విప్లవం జరిగింది. సన్‌యెట్‌సేన్‌నాయకుడు. అతడు రాజును తొలగించిరి. పబ్లిక్‌ను స్థాపించాడు. అచటి చైనీయుల విప్లవశక్తులను, మాతృదేశ భక్త్యుత్సాహాలను చూచిన సింగ్‌కు దేశభక్తి మనసులో రవరవలు పుట్టించింది.

ఆరోజుల్లో భారతీయులలో విద్యార్థులనుతప్ప యితరులను అమెరికాకు వలస రానిచ్చేవారుకారు. హాంకాంగ్‌లో భాయిరతన్‌సింగ్ అనే దేశభక్తునితో మైత్రికలిసింది. అతడు రూ. 400 లు. బదులిచ్చి సింగును తనవెంట ఫిలిప్పైనుదీవులకు ముఖ్యపట్టణమైన మణీలాకు తీసుకొనివెళ్ళాడు. అచ్చట వారిద్దరూ సిల్కువర్తకుల దగ్గర ఏజంట్లుగా కుదిరారు. పృథ్వీసింగ్ రతన్‌సింగ్ అప్పు కొద్దికాలములో తీర్చేశాడు. రతన్‌సింగ్ వ్యాపారదీక్షితుడు కావడంచేత అమెరికా వెళ్ళిపోయాడు. పృథ్వీసింగ్‌కు మణీలాలోనున్న భారతీయుల పరిస్థితులుచూస్తే చాలా కష్టమనిపించింది. గౌరవమేలేదు. అచటి భారతీయులకు. అక్కడే భారతీయులతో కలిసి బట్టలు అమ్ముతూవున్నాడు. ఒకనాడచటి భారతీయులు కొందరు తలకు గుడ్డలుచుట్టుకొని పోతూంటే పిల్లలు వాళ్ళవెంటబడి రాళ్లువిసరడం మొదలెట్టారు. పోలీసులకాసంగతి రిపోర్టుచేస్తే వాళ్లుకూడా అదే పనిసాగించారు. పృథ్వీసింగు దాన్నిచూచి

సహింపక పోలీసులతో దెబ్బలాడాడు. అతణ్ణి పోలీసు లరెస్టు చేసి తీసికెళ్ళారు. ఆపట్టణపుప్రసిడెంటు అప్పాలజీయి స్తేవదులు తానంటే సింగ్ శిక్షతీసేసినాసరే యివ్వనన్నాడు. పృథ్వీసింగ్ అరెస్టుకబురు ఆ నగరంలోఉండే చౌదరీబర్కాట్ అనేభారత మహమ్మదీయునికి తెలిసి ప్లీడర్ని పెట్టి వదలిపించవచ్చాడు. అంతతో పోలీసులు పృథ్వీసింగుకే అప్పాలజీచెప్పి వది లేశారు.

అనంతరం పృథ్వీసింగ్ అమెరికా వెడతానంటే అచ్చటి భారతీయ మిత్రులతనికి ధనసహాయంచేశారు. 150 డాలర్లు సర్దార్ లాల్‌సింగ్ అప్పుకింద యిచ్చాడు. మరొకరు 50 డాలర్లిచ్చాడు అమెరికాలోప్రవేయాణీకుడైనా ఓడదిగడంతోగుడ్డలుకుట్టించారు. వేరొకస్నేహితుడు 50 డాలర్లు అచటి అధికార్లకు చూపుతేనే గాని నగరంలోకి పోనివ్వరు. 50 మంది భారతీయులు ప్రయాణంచేసే ఓడమెక్కి అమెరికాకు పయనమై సుమారు నలభై దినాలు పయనించి ఫసిఫిక్ సముద్రందాటి ఆయోడ అమెరికా సంయుక్తరాష్ట్రాల పశ్చిమతీరమందున్నసీటల్ అనే ఓడరేవుచేరింది. ఆరాష్ట్రప్రభుత్వాధి కారులచ్చట ఓడదిగిన భారతీయులందర్నీ ఎవరెవరేయేపని మీాద అమెరికా వస్తున్నారని అడిగారు. తక్కినవారి కింగ్లీషురానందున పృథ్వీసింగే దుబాసీగావుండి భారతీయుల నడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పాడు. ఏవేవో కారణాలుచెప్పి అంతా అమెరికా దిగడానికి అనుజ్ఞపొందారు. ఆఖరున పృథ్వీసింగును అడిగితే 'నామాతృదేశబానిస శృంఖలాలను

విడగొట్టి స్వాతంత్ర్యమెట్లా సంపాదించాలో నేర్చుకోడానికి వస్తున్నాను' అన్నాడు. అచటి ఉద్యోగి నివ్వెఱపడి సింగ్‌ను తేరిపాఱజూచి సంతోషంతో భుజంతట్టి ఓడదిగడాని కాజ్ఞయిచ్చి ఆహ్వానించాడు. ఓడదిగి రైలెక్కి కాలిఫో ర్నియా రాష్ట్రంలోని స్టార్‌టన్‌నగరానికి వెళ్ళాడు పృథ్వీసింగ్.

అమెరికా ప్రజలు బ్రిటీషుసామ్రాజ్య వాదులతో వాషింగ్‌టన్ నాయకుడుగా పోరాడి స్వాతంత్ర్యాన్ని పొం దారు. అందులో అచ్చటి కార్మికులు స్వాతంత్ర్యాభావ వీధు లలో నుఱ్ఱూతలూగడం నేర్చుకొని తమ మాతృదేశ దాని సత్వాన్ని గుర్తించుకొని స్వాతంత్ర్యపథంలో ముందుకుసాగ సంకల్పించుకున్నారు. జ్వాలాసింగ్ అనే భారతీయుడు అప్పట్లో అమెరికాలోని కార్మికులకు, విద్యార్థులకు జాతీయ చైతన్యం కలిగింప తన ధనప్రాణాలను ధారపోసేవాడు. ఆస మయంలోనే చైనాప్రజావిప్లవంవచ్చి అది భారతదేశాని కూడా పాకింది. ఆతరుణానికే లాలాహరదయాల్ అనే భారతీయుడు అమెరికావచ్చి తన జాతీయప్రబోధంచే యచటి భారతీయుల నాకర్షించాడు. జ్వాలాసింగ్, సోహన్‌సింగ్, ఖేరసింగ్, ఉద్దామ్‌సింగ్, జగత్‌రామ్ మున్నగు భారతీయ యువకులు హరదయాల్ ప్రోద్బలంమీద ఒకవిప్లవం సం ఘాన్ని స్థాపించారు. <u>గదర్‌పార్టీ</u> ~~అని దాన్నే అంటారు.~~ అందులో సర్దార్ మెహర్‌సింగ్ అనే భారతీయుడుకూడా ఒక సభ్యుడు. అతడు వ్యవసాయదారుడు. అతని బంగాళా

దుంపలపొలంలో పృథ్వీసింగ్ పనిచేయడానికి కుదిరాడు. ఆపని కష్టమైనా క్రమంగా పరిపాటి చేసుకొన్నాడు.

ఆగదరుపార్టీ చురుగ్గాపనిచెయ్యడం మొదలెట్టింది. అమెరికా, కెనడాలలోని భారతీయులలో నుద్రేకాన్ని ప్రజ్వలింపజేసింది. ఆపార్టీపక్షాన 'శాన్‌ఫ్రాన్‌సిస్కో' మహానగరం నుండి 'గదరు' పత్రిక వెలువడసాగింది. లాలాహరదయాల్ సంపాదకుడు, స్వంతప్రెస్సు, భారతయువకులు 12 మంది పనిచేసేవారు. అమెరికా ప్రభుత్వం కొంతకాలం చూచి చూడనట్లుగా వూరుకుంది. పార్టీ బలపడినకొద్దీ అచటి బ్రిటిషురాయబారి అమెరికా ప్రభుత్వాన్ని ఒత్తిడి చేశాడు. దాంతో హరదయాలును అరెస్టుచేసి యిండియాకు పంపారు. పార్టీ మరింత చెలరేగింది. అప్పటికే గదరుపార్టీపరిస్థితి పృథ్వీసింగుకు తెలిసి వూగులాడుతున్నాడు. హరదయాలు అరెస్టువార్తతో ఒక్కమాఱుగా పృథ్వీసింగ్ ఉద్రిక్తుడై వెంటనే శాన్‌ఫ్రాన్‌సిస్కోకువచ్చి గదరుపార్టీప్రెస్సులో డ్రయివరుగా పనిచేయ నారంభించాడు. అక్కడే రతన్‌సింగ్ పనిచేస్తున్నాడు. మణీలాలో తనకు సాయపడిన ఆమిత్రునికలయికతో పృథ్వీసింగ్‌కు ఆవేశం ఎక్కువైంది.

హరదయాల్‌ను ఇండియా పంపడంతో సరియైన నాయకుడులేక పార్టీబలం తగ్గిపోయింది. కొందరు భారతీయులే ద్రోహులై ఆపార్టీని అణచడానికి ప్రారంభించారు. కాని ఆమోసగాండ్లలో చాలమంది విప్లవకారులచే చంప

బడ్డారు. అమెరికాలోప్లకారులు కొంత గదర్ పార్టీకి ప్రోత్సా హకు లయ్యారు. అయితేనేమి నాయకుడు సరియైనవాడు లేక ఉద్యమం జోరుగా సడవటంలేదు. పృథ్వీసింగ్ అను భవం లేకపోయినా అన్నిటికీ ముందుగా నిలబడేవాడు. కాని యింతలో గదరుపార్టీకి తోకచుక్కా అనిపించేసంఘటన ఒకటి తారసిల్లింది.

ఏదేశంలోనైనా మానవులు మాతృదేశాన్ని వీడి అన్యదేశాలకు వలసపోవడానికి పుట్టినచోట పొట్ట జరక్క పోవడమే కారణంగా కనిపిస్తుంది. 20 శతాబ్దారంభంలో వేలాదిపంజాబీలు కెనడాకు వలసవెళ్ళి అక్కడ గనులలోను, అడవుల్లోను, ఫ్యాక్టరీలలోను పనిచేస్తున్నారు. కాని పదేళ్ళు కెనడాదేశీయులు పంజాబీలవల్ల ఎంతోలాభం పొంది అక్కడ నుంచి కెనడాకు భారతీయులు వలస రాకూడదన్నారు. అంతే గాకుండా చాలాకాలాన్నుంచున్న భారతీయుల్ని తమదేశా న్నుంచి తరిమడానికి యత్నించారు. అయితే దాన్నిగురించి పంజాబులున్న ఇతరదేశాలలో ఆందోళన చేసారు. దాంతో కెనడీ యులు వెనక్కుతగ్గారు. అప్పుడు భారతీయ లోకరాయ బారవర్గాన్ని బ్రిటిషుపార్లమెంటుకు పంపి వారిచే కెనడాలో నున్న భారతీయులు తమకుటుంబాలను తెచ్చుకోడాని కవ కాశ మివ్వాలని చెప్పించి ఒప్పించారు. కాని కెనడాప్రభుత్వం సరియైన రహదారీ లేదని నిరాకరించింది. అంతలో భారతీ

యులు నిరాశజెందక బాబా గురుదత్తుసింగ్ ద్వారా సింగ పూరునుండి జపానువోడ నద్దెకు తెప్పించారు. దానిపేరు 'కొామగాటామారు'. అందులో కలకత్తారేవులో 400 మంది కెనడాలోవుండే భారతీయులకుటుంబాలను ఎక్కించి కెనడాకు బయలుదేరదీసి కెనడాదేశపు రేవుపట్టణమైన వాంగోరు కాయోడను చేర్చారు.

ఓడ రేవు చేరగానే కెనడాప్రభుత్వం అడ్డగించి వెనక్కు పొమ్మన్నది. గురుదత్తుసింగ్ అంగీకరింపక ప్రయాణీకులు దిగి తీరవలసిందే అన్నాడు. ప్రభుత్వం పోలీసులను రప్పిస్తే ప్రయాణీకులు వారిని తరిమేశారు. అపుడు కెనడాప్రభుత్వం యుద్ధనావను తెప్పింప యత్నించింది. ఓడలోవారికి తిండితిప్పలు లేక మలమల మాడుతున్నారు. అక్కడే మృత్యువు తప్పదన్నంతవఱకు వచ్చింది. మీరు యుద్ధనావను రప్పిస్తే రేవు పట్టణాన్ని బూడిద చేస్తామన్నారు భారతీయులు. ఇంత వఱకూ వచ్చినా బ్రిటిషుప్రభుత్వం నిర్లక్ష్యంగా వూరుకుంది. దాంతో భారతీయులహృదయాలు భగ్గుమనిపోయాయి. ఈ ఉదంతాన్ని ఉన్నదున్నట్టుగా గదర్ పత్రిక ప్రచురించింది. అందలివ్యాసాలు చూచిన పృధ్వీసింగుకు ఎక్కడలేని ఆవేశం కలిగింది. దేశగౌరవం నిలబెట్టడానికి నడుము కట్టాడు. భారతీయులంతా 'శాక్రిమెంట్సు' నగరంలో సభచేసి స్వాతంత్ర్యసైన్యాన్ని నిర్మించి బ్రిటిషుప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధప్రకటన చేసారు. ఆసైన్యంలో చేరాడు పృథ్వీసింగ్.

కెనడాభారతీయులంతా మాతృదేశానికి చేర రెడీగా వుండవల సిందని తీర్మానించారు. ఆసభకు బ్రిటిషుప్రభుత్వగూఢచా రులు, ఇండియాప్రభుత్వ సి. ఐ. డి ముఠాబోర్రికర్లంతా వచ్చారు. వారికి కావలసిన భోగట్టా తీసుకున్నారు. భారతీ యులేమో అనుకున్న ప్రకారం మాతృదేశం వెళ్ళడానికి తయారై చెప్పుల్లో కాళ్లుపెట్టు కూర్చున్నారు.

## స్వదేశాభిగమనము

స్వాతంత్ర్యసైనికులంతా వారివారి ఆయుధసామ గ్రితో ఓడ ఎక్కారు. అప్పుడే యుద్ధకౌన్సిల్, ఎన్నుకో బడింది. అందులో పృథ్వీసింగుకూడ ఉన్నాడు. ప్రయాణీకు లతనిని ఉపన్యసించ మన్నారు. ఉపన్యాసమున భారతదేశపు ప్రజలు మాతృదేశంకోటకు ఎలా మృత్యువును వరించాలో చెప్పాడు. అంతా నిర్వైరపడ్డాడు. శాన్‌ప్రాన్‌సిస్కోనుంచి ఓడ బయలుదేరింది. ప్రపంచమంతా గుప్పుమంది. భారతీయ విప్లవకారులు బ్రిటిషుప్రభుత్వంమీద యుద్ధం ప్రకటించారని వెల్లడయింది. ఓడ 'హోనోలూలూ' రేవుచేరేసరికి కొంద అమెరికన్లు వచ్చి ఓడెక్కి బ్రిటిషువారిని తరమండని ప్రో త్సాహ మిచ్చారు. అప్పటికి ప్రథమ ప్రపంచసంగ్రామం జరుగుతోంది.

ఆ సైనికులఓడ జపానురేవుపట్టణమైన 'యోకహోమా' చేరింది. పృథ్వీసింగుకు అక్కడ హఠాత్తుగ 'పరమానంద

ఝూన్సీ' అనే స్నేహితుడు కన్పించి అమెరికా వెళ్ళడానికి వచ్చానన్నాడు. సింగ్ అతనిని తమ యోడమీద మాతృ దేశానికి పదరలమని పిలిచాడు. ప్యాసుపోర్టు లేకుండానే ఓడ యెక్కి వచ్చాడు. కాని అధికారులు అడ్డారు. కేవుచెల్లించి ఓడలో ఎక్కాడు. ఓడ హాంకాంగ్ సమీపంలోకి వచ్చింది. అమెరికాఓడ హాంకాంగ్ దాటి రాదు. ఓడలోని మన సైనికు లప్పటితమపరిస్థితులను గురించి ఆలోచన చెయ్యాడ మారం భించారు. ఓడ రేవులో ఆగడంతోనే అధికారులు సోదా చేయడం మామూలు. ఆయుధాలుంటే అరెస్టు చేస్తారేమో? ఇప్పు డేమిటి చెయ్యడం? ఆయుధాల నన్నిటినీ సముద్రగర్భం లో దాచడమే కర్తవ్యమని నిర్ణయించి యశ్రుధారలు విడు స్తూ ఆయుధాలను సముద్రంలో విడిచారు.

అవి ప్రథమ ప్రపంచసంగ్రామపురోజులు. అప్పట్లో 'ఎమ్డన్' అనే జర్మనీజలాంతర్గామి హిందూమహాసముద్రంలో స్వైరవిహారం సాగిస్తోంది. ఆభయంవల్ల ఓడలు తఱచుగా తిరగడంలేదు. హాంకాంగ్ ప్రజ లీఓడను రేవులో చూడగానే గుంపులుగా అచటికి చేరారు. ఆరేవులో భారతీయసైనికులు కాపలావుండి ఓడకు సిగ్నల్సు యిచ్చారు. ఓడలోనివారు పంజాబీవిప్లవకారు లీయోడలో భారతస్వాతంత్ర్యసిద్ధికై వెడు తున్నారని ప్రత్యుత్తర మిచ్చారు. మేమూ మీతోపాటే నన్నా రచటికాపలాసైనికులు. హాంకాంగ్‌లో సోదాలు

వగైరా లేమీజరగలేదు. భారతీయసైనికులు మిలటరీసాను భూతి వెలిబుచ్చారు. పృథ్వీసింగ్ విప్లవసందేశాన్ని సైనికుల కందజేయడానికి మిలటరీకేంద్రానికి వెడితే వారు చాలా శ్లాఘించారు. హాంకాంగ్‌ను పట్టుకోడానికి ఆలోచించారుగాని ఏంప్రయోజనమని ఊరుకున్నారు. అక్కడనుండి వేరొక జపానుఓడలో బయలుదేరి ప్రమాదం లేకుండా సింగపూరు చేరారు. అచ్చటిభారతీయసైనికులు వీరి ఉద్యమాన్ని పొగడి మీఅడుగుజాడల్లో నడుస్తామన్నారు. త్వరితంగా మాతృదేశం చేర ఆతురపడు విప్లవకారులు సింగపూరులో ఆగక తిన్నగా రంగూను చేరారు. ఆరేవులో దిగి మిలటరీనివాసాల కెళ్ళి విప్లవసందేశం తెలిపారు. ఇచ్చటవారికి కొమాగాటామారులో మాతృదేశానికి బయలుదేరిన భారతీయులు బెంగాల్లోని బడ్జ్ బడ్జ్‌రేవులో దిగి నగరంలోకి మౌనంగా వెళుతూంటే వారిపై తుపాకులు కాల్చారని, చాలామంది మృత్యుగహ్వరంలో లీనమైనారని తక్కినవారు చెదిరిపోయారని దుర్వార్త తెలి సింది. పృథ్వీసిం గీవార్త విని దుఃఖించాడు.

ఏలాగో ఓడ హుగ్లీరేవు చేరింది. పోలీసు లందరినీ సోదాచేసారు. జగత్‌రామ్‌కు ప్యాసుపోర్టు లేనందున రంగూన్‌లో ఎక్కిన ప్రయాణీకులతో కలిసి తప్పించుకుపోయాడు. పరమానంద్‌కూడ అంతే. పోలీసులు అంగపుష్టిగల కొందర్ని నిలిపేశారు. స్పెషల్‌ట్రయిన్‌లో పంజాబుకు బయలుదేరారు. వీరికి గూర్ఖాసైనికులు కాపలా. సి. ఐ. డీలు పరివారం. పృథ్వీ

సింగునుగూర్చి సి. ఐ. డీలకు శాన్‌ఫ్రాన్‌సిస్కోనుంచి రిపోర్టు వచ్చింది. త్రోవలో కొందరు మారుపేర్లు మారునివాసాలు చెప్పి తప్పించుకొని దిగిపోయారు. పృథ్వీసింగ్ కూడ యత్నిం చాడు గాని సాగలేదు. ఇంతలో రావల్పిండిస్టేషను వచ్చింది. జోరుగా వాన పడుతోంది. సి. ఐ. డిలు గొడుగు లేసు కున్నారు. సందడెక్కువగా వుంది. ఆసమయంలో ప్రజల గుంపులో కలిసి తప్పించుకుపోయాడు. రైలు ముందుకు సాగింది. ఇదే పోలీసులకళ్ళల్లో కారం కొట్టే మొదటి అను భవం. కాని తప్పించుకున్నాం ముందేంజెయ్యాలి? అను కుంటూ నగరంలోకి వెళ్ళి వేషం మార్చి తిరిగి రైలెక్కి పంజాబురాష్ట్రానికి రాజధానీనగరమైన లాహోరు చేరాడు. అచ్చటి రాజపుత్రులను కలుసుకుంటే సాయం చేస్తామన్నారు. అక్కడినుంచి స్వంతవూరు చేరాడు కాని పోలీసులు కాచి ఉన్నారు. ఎలాగో తప్పించుకొని తిరిగేవాడు.

## విప్లవానుభవఘట్టాలు.

విప్లవకారు లెప్పుడూ తమసమావేశాలను రహస్యం గానే జరుపుకుంటారు. ఒకప్పు డొకనగరప్రాంతమందున్న క్షేత్రములలో కలిసారు. తమప్రాంతాలపరిస్థితులు అన్యోన్యం చెప్పుకున్నారు. ఇంకోసారి ఒక రైల్వేస్టేషనుకు దగ్గరగా ప్రయాణికులవలె అభినయిస్తూ సమావేశమై కార్యక్రమం

జరిపారు. ఆసమావేశంలో కొందరార్థికదుస్థితిని వెలిబుచ్చారు. కొందఱు దోపిడీలు చేదామన్నారు. నాయకులు దాని కంగీక రించలేదు. పంజాబు బెంగాలు విప్లవకారుల సంబంధబాంధ వ్యాలను పొత్తుచెయ్యడానికి పృథ్వీసింగును నియమించారు. సరిహద్దురాష్ట్రింతో పని చేయుటకు జగత్ రామును ఏర్పాటు చేశారు. హఠాత్తుగా జగత్ రామ్ అరెస్టయినట్లు పత్రికలలో ప్రకటింపబడినది. ఒకగుఱ్ఱపుబండిలో విప్లవకారులు పయని స్తుండగా పోలీసులు బండిని ముట్టడిస్తే రెండుపార్టీలవారూ ఆయుధాలతో కలియబడి కాల్చుకున్నారు. మొదట పోలీ సులు పారిపోయి అదనంగా సాయం తెచ్చుకొని విప్లవకారు లను తిరుగా చుట్టుముట్టారు. విప్లవకారులదగ్గిర మందు అయి పోవడంతో లొంగిపోయారు. అందరినీ అరెస్టు చేశారు.

విప్లవకారులలో కొందరు అరెస్టులకు పిమ్మట నిరు త్సాహు లయ్యారు. కొందరు పృథ్వీసింగును విప్లవోద్యమం లోంచి తగ్గిపొమ్మని సలహా యిచ్చారు. కాని సింగ్ వారి సలహా లక్ష్యపెట్టక సైన్యంలోను, రాజపుత్రులలోను రహ స్యంగా విప్లవోద్యమాన్ని రేకెత్తించేవాడు. పంజాబుపోలీ సులు ఏలాగైనా పృథ్వీసింగును ఇప్పట్లోనే అణచివేయాలని తీవ్రయత్నం చేస్తున్నారు. అంతలో మితవాది, ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, చిన్నతనంలో పృథ్వీసింగు నెఱిగినవాడు అయిన లేహానాసింగ్ ప్రభుత్వభక్తిపరాయణుడై సింగును మోసం

చేసి పట్టి గవర్నమెంటు కొప్పగింప పూనుకొన్నాడు. అందు కోసంగా అనేకపన్నాగాలు పన్నుతున్నాడు. ఒకనాటిరాత్రి అంబాలా రాజపుత్రుల బోర్డింగ్‌కు పృథ్వీసింగు వచ్చాడు. అంతలోనే లేహనాసింగ్ అనాడు క్యాంపువేశాడు. అచటి విద్యార్థులు లేహనాసింగ్ దేశభక్తుడని మాటలసందడిలో పృథ్వీసింగ్ యిక్కడే వున్నాడని చెప్పారు. దాంతో లేహనా సింగ్ పొంగిపోయి పృథ్వీసింగ్‌ను కలిసి కాస్సేపు కబుర్లు చెప్పి మావూరువచ్చి నాల్గురోజు లుండమని కోరాడు. పృథ్వీసింగ్ ఏజవాబూ చెప్పలేదుగాని యింతనీచాని కతడు సిద్ధపడతా డనుకోలేదు. లేహనాసింగ్ అప్పుడే పోలీసుసూపరెండెంటును కలిసి పృథ్వీసింగ్ ఫలానాతావున వున్నాడని రిపోర్టు చేశాడు.

మఱునాటిపొద్దున విద్యార్థులంతా పాఠశాల కెళ్ళారు. పృథ్వీసింగ్ ఒంటరిగా అక్కడే వున్నాడు. ఎక్కడికో వెడదా మని డ్రెస్సు వేసుకుంటూంటే తలుపెవరో తట్టిన చప్పు డయింది. తలుపు తెరిచాడు. సిక్కులు బోర్డింగ్ హౌస్ ఎక్కడని తలుపుతట్టిన పెద్దమనిషి అడిగితే ఇది రాజపుత్రులది. వచ్చి చూపిస్తా నాగండి సిక్కులబోర్డింగ్ అని పృథ్వీసింగ్ చెబుతూంటే ఆపెద్దమనిషి ఎంచేతో గాభరాపడ్డాడు. పృథ్వీ సింగ్ నిశ్చేష్టుడై చూస్తుండగానే ఆతడు రివాల్వరు పైకి తీసి గురిపెట్టి నీవు నావెంటనంటి రాకపోతే కాలుస్తానన్నాడు. పృథ్వీసింగ్ అంతా గ్రహించి చటాలున నతనిపై కురికి రివా

ల్వారు పట్టుగున్నాడు. రివాల్వారులాగేసి గదిలో బంధించాలని సింగ్ యత్నం. ఎలాగో రివాల్వారు లాగి పారేశాడు. ఆతడు కత్తి దూసి సింగుపై బడి మెడమీద గాయంచేశాడు. దాంతో దెబ్బతిన్న పులివలె సింగ్ విజృంభించి ఆపోలీసుద్యోగిని పట్టు కొని అమాంతంగా గోడకేసి కొడితే స్పృహతప్పి కిందపడ్డాడు. గాయాలరక్తవాహినితో సింగూ అంతే. పృధ్వీసింగుకు మర్నా డుగాని తెలివిరాలేదు. పోలీసు ఆస్పత్రిలో పడేసి గాయాలకు కట్లుకట్టిస్తున్నారు. యూరోపియన్ సర్జను చికిత్సచేస్తూ తిడితే వాగావంటే తన్నుతా నన్నాడు. పోలీసులు పిచ్చుకత్తులతో పహారా. మేజస్ట్రేటు, సూపరింటెండెంటు దూరంగావుండి మాట్లా డుకుంటూ సింగుకు తెలివిరావడంతో దరికొచ్చి చార్జి వినిపించి వాఙ్మూలమిమ్మంటే సింగ్ ఒక్క తలకట్టయినా చెప్పకపోతే ప్రాణంవిసిగి వెళ్ళిపోయారు. అంబాలానగరమంతా గొప్పవిప్ల వకారుని పోలీసులరస్టుచేశారని, ఇతరవిప్లవకారులు దాడిజరిపి యతన్ని విడిపిస్తారనీ పుకార్లుపుడితే పోలీసులుభయపడి పృధ్వీ సింగును జైలుకు తీసికుపోయారు. తాగడానికినీళ్ళుగాని, తినడా నికి తిండిగాని పెట్టలేదు. ఒకప్రక్క గాయములసలుపు, ఇంకో ప్రక్క ఆకలిబాధ, కటికనేలమీదపడక, తీవ్రమైన జ్వరబాధ. అతనిస్థితి చూడండి. బంధువులు చూడవస్తే అధికార్లు ససేమిరా అన్నారు. ఇలాంటిబాధలు భారతదేశంలోని జైళ్ళలో వుంటా యని అమెరికాలో విన్నాడు. ఇపుడు ప్రత్యక్షంగా అనుభ విస్తున్నాడు. కాని జైలుఅధికారుల కఠినశాసనాలతని ధైర్యా న్నినుమడింపజేశాయి.

## ౭

## కేసులు - శిక్షలు.

"ఒకచో నేలను బవ్వళించు నొకచో
నొప్పారు పూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో
నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొకతఱిన్
యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుః
ఖంబుఁ సుఖంబున్ మదిన్"

### 1 అంబాలా కేసు.

ఏవిప్లవకారుడుగాని తనకర్తవ్యాన్ని తూచా తప్ప కుండా నెరవేర్చాలంటే విప్లవోద్యమచరిత్రలను పరిశోధించి జీర్ణింపజేసుకొని వారియనుభవాలను హృదయసీమ నిడుకొని జాగరూకతతో మెలగాలి. పోలీసువాళ్ళుపన్నే మోసపు వలల్లో పడకూడదు. ఎప్పడికప్పుడు వారిని డీకొనే తెలివి తేటలు సంపాదించాలి. పృథ్వీసింగ్ ఆలెక్కల్లోవాడే.

కానైతే అనుభవం స్వల్పం. పృథ్వీసింగ్ చేత వాగించి కూపీ లాగడానికి పోలీసువాళ్ళు ఒకయెత్తెత్తారు. అతడు ఆస్పత్రిలో వుండగా నతనికి చదువురోజుల్లో తెలిసిన ఒకణ్ణి సంపాదించి వాడిచే నారింజకాయలు ఇప్పించి సంగతు లడగించి చనువుగా దగ్గరకు రానిచ్చి మెల్లగా కేసుమాటల్లో దింపేటట్లు చేశారు. పృథ్వీసింగ్ జైలుకొచ్చిన కొత్తలో ఆస్పత్రిలో సింగును సాయంచేసినవాణ్ణి అతనిపక్కగదిలో వుంచి బాధలుపెట్టినట్లు నటనచేశేవారు. సింగ్తో స్వేచ్ఛగా మాట్లాడ నిచ్చేవారు. వాడు క్రమంగా సింగ్తో సంభాషిస్తూ నీ మూలాన నా కీగతి పట్టిందనేవాడు. విప్లవవాక్యాలు పలికి ఏవో ప్రశ్న లడిగేవాడు. ఒకనాడు నాల్గుమాసాలక్రిందట జగత్రామ్ను చూచానని చెప్పాడు. అప్పటికే జగత్రామ్ భారతదేశంలో లేడని యెఱిగిన పృథ్వీసింగ్కు వీడు పోలీసులంపినదోహి అని తెలిసిపోయింది. కాని వాడితో మామూలుగానే ఉండేవాడు మరోనాడు బాంబులు చేసేదెట్లానో చెప్పమ నడగాడు. కాకి తం-పెన్సిల్ తెచ్చుకోమన్నాడు పృథ్వీసింగ్. ఆమర్నా డుదయానికల్లాఅవి వచ్చేశాయి. ఏవో కొన్నిమందులపేర్లు వ్రాసి పాయిమీద మూకుట్లోవేసి వీటిని వేయించమన్నాడు సింగ్. వాడు నేను చస్తానేమో అంటే అల్లా కావలసిందే అన్నాడుసింగ్. దాంతో వాడిప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరయిందని అధికారులతో చెపితే వా ణ్ణవతలకు

తోసేశారు. వాడికా జైలు శిక్ష పూర్వకర్మదుష్కృతం కాబోలు!

పృథ్వీసింగ్ కేసు విచారణకు పెట్టి దాన్తో బోర్డింగ్ స్కూలు విద్యార్థి నొకనిని కుక్కారు. పస్టుక్లాసుమేజస్ట్రేటు విచారణచెయ్యడం. పృథ్వీసింగ్‌ను కాల్చబోయి తన్నులు తిన్నవాడు సిక్కు సబ్ యినస్పెక్టరని విచారణలో తెలిసింది సింగ్‌కి. సూపరింటెంటు ఖైదీని పాటిపోకుండా చూడమని వాడినే కాపలాపెట్టాడు. వాడు భయపడి అవకతవక చేసాడు ఏదో సాకు చెప్పి మర్డరుచేయ యత్నించాడని యింకా సెక్షన్లు చేర్చారు. విద్యార్థిమీద ఇనస్పెక్టరుపర్సు దొంగిలించాడని అబద్ధపుకేసు బనాయించారు. విచారణలో లాయర్లప్రతివాదం లేకుండానే సెషన్సుకు కేసు పంపాడు. షాదీరామ్ కొడుకుసంగతివిని బర్మానుంచి వచ్చి జైలుఅధికారులయాజ్ఞ మీద కొడుకును కలిసాడు. అతండ్రీకొడుకులు ప్రక్కనున్న పోలీసుద్యోగికి తెలియకుండా బర్మాభాషలో మాట్లాడుకున్నారు. తండ్రి లాయర్ని పెడతానంటే కొడుకు దేశానికొకపుత్రు నర్పించానను కొమ్మనీ, తనమీాద పవిత్రమైన ఆశాపెట్టుకోక దీవెనయిమ్మనీ అర్థించాడు. షాదీరామ్ హతాశుడై మరలాడు. సెషన్సుకోర్టులో విచారణ జరిగింది. పోలీసువారు బోర్డింగ్ విద్యార్థులను, అధికారులను తప్పుడుసాక్ష్యం చెప్పమంటే లొంగలేదు. ఆకోర్టులో ఆనాడు ఒకమహామ్మదీయుడు, ఇద్దరువర్తకులు అసెసర్లు. జడ్జీవారి అభిప్రాయ

మడగ్గా ముగ్గురుకూడా ముద్దాయీలు నిర్దోషులని చెప్పారు. కారణాలు చెప్పమని జడ్జి అడిగితే పోలీసువారికి భయపడి ఖంగారుపడ్డారు. జడ్జీ పోలీసుల్ని బయటకు బంపేశాడు. అప్పుడు అసెసర్లు ఏకగ్రీవంగా చార్జీలు రుజువు కాలేదు గాబట్టి ముద్దాయీలను విడిచివెయ్యాలన్నారు. గవర్నమెంటు ప్రాసిక్యూటరు జడ్జీని శిక్షవిధించాలని ఒత్తిడి చేస్తే పృథ్వీసింగ్‌కు 10 ఏళ్లు, విద్యార్థికి 15 మాసాలు కఠినవరకం శిక్ష విధించి సింగును సెంట్రల్ జైలుకు పంపి తిండి పెట్టక ఖైదీలువిడిచిన మురికిబట్టలిచ్చి జొన్నలు తిరగలితో విసరమన్నారు. రోజుకు 40 పౌనులుజొన్నలు విసిరేవాడు. ఉరిశిక్షఖైదీలనుంచే కొట్టులో పెట్టారు సింగును. బ్రిటిషుప్రభుత్వం భారతదేశంలో అనుసరించే న్యాయస్థానపద్ధతే యింత.

## 2 లాహోరుకుట్రకేసు.

ఏదేశంలోగాని ఒకవ్యతిరేకోద్యమ మున్ముమ్మురంగా లేచిందంటే దాన్ని అణిచేవారు ఏకొద్దిమందినో పట్టుకున్నంత మాత్రాన ఆయుద్యమం భగ్నంకానేరదు. ఆలాగే అమెరికాలో బయలుదేరిన గదర్‌పార్టీ పరిస్థితి వచ్చింది. భారతదేశాని కమెరికానుంచి విప్లవకారులను కొన్నిప్రాంతాలకు పంపించి ప్రచారం సాగిస్తోనే వుంది. వారు భారతసైనికులతో సంబంధాలు పెట్టుకొని దేశభక్తిని రేకెత్తించారు. భారతీయ సైన్యాలు అన్నివిధాలా రెడీ అన్నారు. మొదటిప్రపంచ

సంగ్రామపుదినము లవి. భారతీయసైనికులు విదేశాలకు పో నిష్టపడలేదు. తిరుగుబాటు లేపితే లాభించేటట్టుంది. బ్రిటిషు వారికి తమసైన్యపుబలహీనత తెలుసు. అందుచే ప్రభుత్వం కేవలం దేశద్రోహులయిన గూఢచారులపై ఆధారపడుంది. ఆపద్ధతిమీదే 'కిర్‌పాల్‌సింగు' అనేద్రోహిని లోబరచుకొంది. వాడు విప్లవకారులవిశ్వాసాన్ని పొందినవాడు. తిరుగుబాటు కు నిర్ణించిన దినము, ప్లాను తెలిసికొని గవర్నమెంటుకు చెప్పే శాడు. దాంతో వారు ముందుగానే సాధనాలు సమకూర్చు కొని 85 మందిని అరెస్టు చేసారు. ఈకేసులో పృథ్వీసింగ్ కేమీ తెలియదు. ఏలాగైనా కొంతకూపీ యితనిదగ్గఱ తీయా లని సంకల్పించింది. బెదరింపులు, బూకరింపులు చేసినా వ్యర్థ మైంది. సూపరిండెంటు విసుగొచ్చి సణుక్కుంటూపోయాడు.

ఈకేసులో ప్రభుత్వం 85 ముద్దాయిాలను దూర్చింది. ఇందులో ఏమి తెలియనివారుకూడ ఉన్నారు. 65 రు పట్టుబడి 8 రు అప్రూవర్లుగా మారారు. అలా మారటమంటే పోలీసు వాళ్ళు మీాకేమీా ప్రమాదంలేకుండా మేం తప్పిస్తాం. మేంచెప్ప మన్నవిధంగా సాక్ష్యంపలకండని బోధిస్తే గవర్నమెంటు తర ఫున తప్పుడుసాక్ష్యం చెప్ప నంగీకరించినవారన్నమాట. వీళ్లే పోలీసులకు పృథ్వీసింగుచర్యంతా చెప్పారు. సింగపుంగొదము పంజానుండైనా తప్పించుకోవచ్చుగాని ఈ సి. ఐ. డీలబాధ తప్పించుకోడం కష్టం. వీళ్ళకళ్ళల్లో దుమ్ముకొట్టడంకూడా సులభమేకాని యది సత్యమార్గంగా సాగదు. పృథ్వీసింగ్

తప్పుకథ యేదో చెప్పి తప్పించుకో యత్నించాడు. లాభించ
లేదు. బ్రహ్మాండమైన ప్రశ్నలు వేస్తారు. వాళ్ళే కొన్నింటి
కాన్సర్లు చెప్పుకుని ముద్దాయి చెప్పినట్టుగా రాస్తారు. గాలి
పోగుచేసి ప్రాణంపోస్తారు. పృథ్వీసింగ్ తా నెలాగూ చెప్ప
దలచేవాడు కాదుకాబట్టి ఏమడిగినా 'నాకేమీ తెలియదు.
జ్ఞాపకంలేదు' అనిచెప్పితే వాళ్ళూళ్ళే వదలుకున్నారు. లాహోరు
కుట్ర కేసులో పోలీసులు కొడుకు నిరికించారని తెలిసి హాదీ
రామ్ చూడవచ్చాడు. కాని కొడుకు తండ్రి నానవాలు పట్ట
లేనంతగా జుట్టునెరసి మనిషి క్రుంగిపోయి శల్యాలుమాత్రమే
ఉన్నట్టు కన్పించాడు. గాంభీర్యంమాత్రం సడలలేదు.

పృథ్వీసింగును లాహోరుజైలుకి మార్చారు. అచ్చట
ఆరోగ్యం చెడింది. మట్టితట్టలు మోయిస్తూ వైద్యసహాయం
లేకుండా చేసారు. ఖూనీ ఖైదీలకు మంచినీళ్ళిచ్చే పనిచెప్పారు.
దానిలో పోలీసులతో పోరాడిన స్నేహితు లున్నారు. బాబా
సోహనసింగ్ కూడా ఆజైలులో అదేవార్డుకి వచ్చి తోడిస్వా
తంత్ర్యయాగదీక్షితులను జూచి పరమానందం పొందాడు.
మరోరెండురోజుల కక్కడికే జగత్ రామ్ ప్రత్యక్షం. వీరంద
రినీ విచారణ చెయ్యడానికి జైలువార్డు ఒకటి ఖాళీచేసి అం
దులో కోర్టుపెట్టారు. హైకోర్టుజడ్జీలు ముగ్గురు సిద్ధం. ఇద్దరు
దొరలు, ఒక భారతీయుడు. ప్రభుత్వన్యాయవాది 'పెట్నమ్'
అనే దొర. గవర్నమెంటే ముద్దాయీలవాదనకు 7 మంది
న్యాయవాదుల్ని పెట్టింది. కాని వాళ్ళు భాగస్థులు. చక్రి

వర్తిమీద యుద్ధయత్నమే నేరం. కోర్టులో ముద్దాయీలు నిర్లక్ష్యంగా ప్రవర్తించి జడ్జిలను వేళాకోళం చేసేవారు. అందరికీ యింగ్లీషు రాదు. గదర్‌పార్టీతో సంబంధములేనివాళ్ళు ఉన్నారు. ఉద్రిక్తులై యిందులో ఉరికారు. గదర్‌పార్టీలో శాశ్వతసభ్యులు 15 మంది ఈకేసులో ఉన్నారు. వారిలో 7 మంది డిఫెన్సువాదన ఏలాచేయాలో నిర్ణయించుకొని ఆబాధ్యత వహించారు. అందులో పృథ్వీసింగ్ ఒకడు.

ఆవిచారణలో ఎన్ని అక్రమాలో చెప్పలేము. ముద్దాయీల స్టేట్మెంట్లు రహస్యంగా ఉంచబడ్డాయి. ప్రజలను కోర్టుకు రానియ్యలేదు. ప్రభుత్వవార్తలను మాత్రమే పత్రికలలో ప్రకటింపచేస్తూ ముద్దాయీల స్టేట్మెంట్లుమాత్రం జడ్జిగారి డస్కుపెట్టెలో దాక్కున్నాయి. పృథ్వీసింగ్ స్టేట్మెంటులో 'తాను, జగత్‌రామ్‌తో గలిసి అమెరికాలో గదర్ పార్టీలో పనిచేశానని, భారతదేశంలోని సి. ఐ. డీలు తెలివయినవారని అమెరికాలో అనుకునేవారని, అయితే నాకు వీళ్ళు దద్దమ్మల్లాగే తోస్తున్నారని తమ ఉద్యోగగౌరవాలను రక్షించుకోడానికి ఏపాప మెరుగనివారి నిరికించారని' చెప్పాడు. ఆమాటలువిని కోర్టంతా నవ్వితే జడ్జి సైలెన్సుకు ఆర్డరన్నాడు. కేదారనాథసైగల్ అనేముద్దాయి మంచిహాస్యగాడు. అతనిస్టేట్మెంటంతా నవ్వులాటే. జడ్జి అతన్ని కొన్ని ప్రశ్నలు వేశాడు. అందులో ఒకటి 'నీవృత్తి ఏమిటి?' అని. నావృత్తి పబ్లిషర్ అన్నాడు. పత్రిక పేరేమిటి? అనడిగితే 'ఖబ

ర్దార్' అంటే జడ్జీకి అర్థంగాక మళ్ళా అడిగాడు. మళ్ళీ అదే సమాధానం. అప్పుడు ప్లీడరు ప్రస్ పేరే అదనిచెప్పాడు.

కర్తార్‌సింగ్ దొమ్మీ్మగూ్రపుకు నాయకుడై ఖూనీ చేయించాడని కోర్టు వాదన. అలాగే చేయించాను. డిఫెన్సు పెట్టుగోను అంటే అతనిధైర్యంచూచి అందరూ విభ్రాంతి నొందారు. పృథ్వీసింగ్ దళాధిపతి. ఆదళంలో ఆతని కొక్కడికే ఉరిశిక్షపడింది. మొత్తంముద్దాయీలలో 20 మందికి ఉరిశిక్ష, ద్వీపాంతరవాసశిక్ష 20 మందిక, వివిధరకాలశిక్షలు 20 మందికి వేసి 5 ని వదిలేసారు. ఉరిశిక్షవిధించినవారిలో ముగ్గురే ఖూనీలో పాల్గొన్నవారు. ఓడదిగ్గానే అరెస్టయిన వారు 15 మంది. ప్లీడరు వైస్రాయికి అప్పీలు చేసాడు. ఈ లోగా ఖైదీలను పెట్టినబాధలను వ్రాయలేము. వైస్రాయి 7 మందికి ఉరిశిక్ష ఖాయంచేస్తూ తక్కినవారికి ద్వీపాంతర వాసం అని ఆర్డరు పంపాడు. ఈ ఉరిశిక్షవేసినవారు కర్తార్‌సింగ్, పింగళే, జగత్‌సింగ్, ఝూలియాసింగ్, హర్‌నామ్‌సింగ్, సాపన్‌సింగ్, ఇంకొకరు. పృథ్వీసింగంటే కర్తార్‌సింగుకు విశ్వాస మధికం. అతడు తనతుదిమాటలుగా 'కంఠంలో ప్రాణం ఉండగా పోరాటం మానొద్దు. శిక్షాంతంవఱకు కూర్చొవద్దు. మనోనిబ్బరముంటే జైలుగోడలు చేనుకంచెలే అవుతాయి.' అని చెప్పాడు. కర్తార్‌సింగ్ అబద్ధమాడకపోవడంచేతను, పింగళే ఢిపెన్సుపెట్టననడంచేతను ఉరిశిక్షకు పాత్రులయ్యారు. ఆభారతస్వాతంత్ర్యయోధులు దేశస్వాతంత్ర్య దీక్షకు తమయాసువులను బలిచ్చారు.

## అండమాను ప్రవాసము.

రాజకీయఖైదీలనేమి, యావజ్జీవ ప్రవాసికుల నేమి ఎప్పుడూ దొరతనం ఒక్కచోట ఉండనివ్వదు. మాటిమాటికి స్థలంమారుస్తూ ఉంటుంది. అలాగే పృథ్వీసింగును, మఱి 18 మంది ఖైదీలను అండమాను ద్వీపాలకు పంపేందుకు యూరోపియన్ పోలీసులతోసహా లారీలో ఎక్కించి మొగలిపురా రైల్వేస్టేషనుకు తీసికెళ్ళి అందర్నీ ఒక్కకంపార్టుమెంటులోనే కుక్కి కలకత్తామెయిలుకు దాన్ని తగిలించారు. ఇద్దరిద్దరికి కలిపి సంకెళ్లు వేసి నిలబెట్టారు. అందులో పడ్డకష్టాలు వర్ణనాతీతాలు. ఎన్నిబాధలు పెట్టినా ఆ దేశభక్తు లుత్సాహం వీడక ప్రతిస్టేషన్‌లోను విప్లవగీతాలు పాడేవారు. ప్రజలుకూడా ప్రతిధ్వను లిచ్చేవారు. రైలు 3 రోజుల్లో హౌరాకు చేరింది. దింపి ఆరాత్రికి ఆలీపూర్ సెంట్రల్‌జైల్లో ఉంచి మర్నాడు మహారాజా అనేఓడలో ఎక్కించారు. అందులోనే అండమానుకుపోయే క్రిమినల్ ఖైదీలున్నారు. వాళ్ళు మనదేశభక్తుల కచటిజైలుఘోరాలు చెప్పారు. పృథ్వీసింగ్ 20 ఏళ్ళు అండమానుప్రవాసం చేసేకన్న ఆ ఉరిశిక్షే మేలేమో అనుకున్నాడు.

ఖైదీలు జైల్లో కాలుపెట్టేసరికి జైలరు మిస్టర్ బారీ బొర్ర ఊచుకుంచూ ఎదురై పకపక నవ్వుతో 'వీళ్ళేనా రాజ్యం సంపాదించడం—రాజ్యంకాదు — నెత్తిమీద రాయి

పెడతా' మన్నాడు. ఆతనిబొజ్జకేసి చూసీ ఖైదీలంతా నవ్వారు. వాడికి ఒళ్ళు మండి తిట్టాడు. వాడంటే ఖైదీలంద రికీ హడలు. ఆజైల్లో 7 బ్లాకులు, 740 కొట్లు ఉన్నాయి. లాహోరు కుట్రకేసుఖైదీలను 2 లేక 3 చొప్పున విడదీసి కొట్లలో పెట్టారు. పృథ్వీసింగును 2 వ నెంబరు బ్లాకులో 105 తో తోసారు. తిండికి రెండువరసలుగా కూర్చోవాలి. హిందువు లొకవైపు, బర్మావారు, ముస్లిములు ఇంకోవైపు కూర్చుని వాళ్ళిచ్చిన 2 చపాతీలు, కూర, పప్పు, తినాలి. తొందరపెట్టేవారు. పృథ్వీసింగ్‌ను విడదీసి మేడకొట్టెక్కిం చారు. ఒక్కొక్కరోజున గంజి పోసేవారు. తర్వాత ప్రతి ఖైదీ 40 పౌనుల కొబ్బరిడిప్పల నార తీసి కట్టలు కట్టాలి. పృథ్వీసింగ్ బలం కలవాడేకాని ఆపని తెలియదు. పరమా నంద్ కూడా అంతే. పని జరిగేదికాదు. ఓనాడు జైలరొచ్చి చూచి తిట్టాడు. వాడికీ ఆపనే జరిగింది. ఖైదీలందర్లోను నన్ను తిట్టడమా అని కొట్టబోయాడు. పరమానంద్ బారీ పొట్టమీద ఈడ్చితన్నాడు. వార్డర్లు లాఠీలతో పరమా నంద్‌ను బాదారు. అతనికి స్పృహ తప్పి పడిపోయాడు. మర్నాడు జైలుసూపరిండెంటు ముర్రే వచ్చి పరమానం దును చూచి 'కుక్క యిలాపడుందేం?' అంటే అతడు నీవు, నీబాబు, నీతాత కుక్కలన్నాడు. సూపరిండెంటు తనపరువు దక్కదని మెల్లగా జారాడు. వార్డర్లు ముక్కోణానికట్టి 20 కొరడా దెబ్బలు కొట్టారు. మందు వేయించలేదు.

కుట్రకేసుఖైదీలు, రాజకీయఖైదీలు కలిసి జైలుఅధికారుల క్రూరత్వం సహించలేక వ్యతిరేకించి పోరాటంసాగింప నిర్ణయించుకొని ఏపనీ చేయమని చెప్పారు. ఆవిధంగా సమ్మె ప్రారంభమైంది. సమ్మెచేసినవారిటిక్కెట్లమీద ప్రవర్తన చెడ్డదని రిమార్కులు రాసి అందరికీ 7 రోజులు నిలువుసంకెళ్ళు వేశారు. 6 నెలలు సంకెళ్లు. 6 నెలలు ఏకాంతప్రవాసం, కొట్టులో ప్రక్కలాగేయటం, మూత్రవిసర్జనకు కుండకూడా పెట్టకపోవడం, ఉదయంమాత్రమే దోసెడుగంజి యివ్వటం, 3 చపాతీలుమాత్రి మివ్వడం ఇదంతా శిక్ష. ఈసమ్మె సాగుతుండగా లాహోరునుంచి వచ్చిన 25 రు ఖైదీలు అనాహూయంగా సమ్మెలో చేరారు. అదివరకు తమకేదేనా అన్యాయం జరిగితే ఖైదీలు పిటీషనులు పెట్టడం అలవాటు. ఆ పద్ధతిమానేసి జైలరు తిడితే తిట్టడం, కొడితే తిరిగి కొట్టడం మొదలెట్టారు. జైలరు హడలుకొని బ్రిటిషుసైనికులను వార్డర్లకు సహాయంగా తెప్పించాడు. ఆసమయంలోనే పృథ్వీసింగు కొరోజున విరోచనాలు, వాంతులూ వెళ్ళి జబ్బుచేసింది. మందైనా వేయించలేదు. జైలరొచ్చి వీడింకా చావలేదా అన్నాడు. పృథ్వీసింగును దుర్వాసనవేసే కొట్టులో వెయ్యాలని వార్డర్లు యిత్నిస్తే నేను వెళ్ళనన్నాడు. పట్టిగెంటాలని ముగ్గురు వార్డర్లు వస్తే, నన్ను ముట్టుకున్నారా దెబ్బకు చంపేస్తానని బెదిరిస్తే దగ్గఱకి పోలేదు. మంచికొట్టులో పెట్టమని జైలరు ఆర్డరు వేసాడు.

సర్దార్ భీషణసింగ్ అనేఖైదీకూడా వాసనకొట్టులోకి నిరాకరిస్తే బారీ 20 మందిని పంపాడు. వాళ్ళు దగ్గర కొస్తూంటే 'నాదగ్గఱ కెవళ్ళు వచ్చినా తాటిమట్టలా చీలుస్తాను. చావు మీామొహాన రాసుంటే రండి' అని సవాలు చేశాడు. బారీ కొట్టమంటే ఎవడూ సాహసింపలేదు. మర్నాడుమంచికొట్టులో కెళ్ళనిచ్చారు. ఇల్లాంటిసంఘటనలు వందలు జరిగాయి. బారీ లాహోరుఖైదీలనుగూర్చి ఇండియా ప్రభుత్వానికి వ్రాసిన రిపోర్టులో తోడేళ్ళగుంపని వ్రాశాడు. తర్వాత ఏకాంతంగా బంధించడం మానడంతోటే సమ్మె మానేశారు. మరోనాడు ఆదివారం పనిచెయ్యాలని ఆర్డరు వేస్తే వార్డర్లు భయపడి అమలుజరుపలేదు. ఒకడుమాత్రం 6 గురు కామ్రేడ్సుపై సూపరింటెంటుకు రిపోర్టుచేస్తే విచారించకుండానే 6 నెలలు బేడీలు, ఏకాంతవాసం శిక్షగా విధించాడు. ఈసంగతి పృథ్వీసింగ్ ఫైలులో సూపరిండెంటుకు తెలియజేసినందుకు అలాటిశిక్షే పడింది. ఖైదీలు శాంతంగా వుందామన్నా బారీ ఏదో పేచీ పెట్టేవాడు. సిక్కులకు సాధారణంగా జుట్టు అధికం. దానిశుభ్రంకోసం నూనె, సబ్బు, వాళ్ళక్కావాలి. అడిగితే యివ్వలేదు. ఏదో తెలగపిండితో తంటాలు పడుతూంటే దానిక్కూడా శిక్ష విధించాడు. ఆష్తోష్ముఖర్జీ అనే బెంగాలుఖయిదీ జబ్బు చేసి నార తియ్యలేకపోతే దెబ్బలు కొట్టించి, జ్వాలాసింగ్, అమరసింగులను తిట్టాడు. ఇలాంటివి మళ్ళీ సమ్మెకు దారి తీసాయి. అంతే

గాక ఖాన్‌సింగు అనే ముసలిఖైదీని తిడితే అతడు తిరిగి అదే సన్మానం చేసాడని కర్రలతో బాదించాడు. అతడు చనిపోయాడు. పృధ్వీసింగుకు రాత్రివేళ యీవార్త తెలిసి ఖాన్‌సింగు దేశాభిమానం స్మృతికి వచ్చింది. ఏదో ఆలోచనలో పడ్డాడు. రాజకీయబందీలందఱకు ఈచిత్రవధ తెలిసి జనరల్ సమ్మె మొదలుపెట్టారు. నిరసనసమ్మెకూడా చేయాల నిశ్చయించి బాబాసోహన్‌సింగు మొదట దారితీసాడు. వెంటనే పృధ్వీసింగ్ అమలుజరిపాడు. మంచినీళ్లుకూడా మానేశాడు.

మర్నాడు నిరశనవ్రతం చేసే ఖైదీలను సంకెళ్ళువేసి 24 గంటలూ గదిలోనే లాకప్ చేశారు. రోజూ తిండి నీళ్ళు కొట్టులో పెట్టినా 8 రోజులు తినక త్రాగక ఊరుకుంటే శోష వచ్చింది. అలాగే 9 రోజులుండి స్పృహతప్పి పడిపోతే ఆస్పత్రికి గొంగళీలో చుట్టి తీసిగెళ్ళారు. అప్పుడుకూడా తిండి తిననన్నాడు. ముక్కుద్వారా ఆహారం ఎక్కించాలని పడేసి మొదలెట్టారు. ఆవేళ వంగలేదుగాని మర్నాడు అతికష్టం మీద చేసారు. 2 నెలలు యిలా నిరశనవ్రతం చేశాడు. అధికారులు ఆశ్చర్యపడి పృధ్వీసింగును ఏమీ అనడం మానేశారు. ఈసమ్మెవార్త భారతదేశం చేరి పత్రికాధిపతులు, ప్రజలు ఆందోళన చెయ్యగా ఖైదీలను బాగాచూస్తామని మాట యిచ్చారు. కొంతమంది నిరశనవ్రతం చాలించారుగాని పృధ్వీసింగు మానలేదు. అంతలోనే జబ్బుగావున్న కామ్రేడ్కు దుప్పటేనా యివ్వడం లేదని తెలిసి స్నేహితు

లకు లేనిసౌకర్యం నా కెందుకని తనదుప్పటి పక్క తీసేసాడు. సంకెళ్ళతోనే పద్మాసనం వేసుకొని రోజంతా కూర్చునేవాడు. దిగంబరుడై అచలి యెలా సహించగలిగాడో!

పృథ్వీసింగ్ దినచర్య ఆరోజుల్లో యిలా వుండేది. పగలు 10 గంటలకు బలవంతంగా తిండి. పద్మాసనంమీదే కూర్చుని నిద్ర. సాయంత్రం మళ్ళా బలవంతపుతిండి. తిరిగి పద్మాసనంమీద కూర్చోడం. ఎవరితోనూ మాట్లాడకపోవడం. ఇది చూచిన వార్డర్లు తపస్సులో వున్నాడనుకొనేవారు. ఎంతో భక్తితో భగవంతుని చూస్తున్నాడని తలచేవారు. ఒకనాడు కమ్మరి వచ్చి సంకెళ్ళు తీసేసి గదినిండా చాపలు పరిచి తలుపులు తెరిచే వుంచాడు. ఆసమయంలోనే బర్మా కుట్రకేసు ఖయిదీలు వచ్చి సమ్మెలో చేరారు. సమ్మెవల్ల చాలామందికి ఆరోగ్యం చెడింది. పృథ్వీసింగు 90 పౌన్లు తగ్గాడు. సమ్మెఫలితం తేలలేదు. 5 నెలల తర్వాత అతడు నిరశనవ్రతం విడిచాడు. మామూలుగా అంతా పనిచేయనారంభించారు.

జైలరు బారీ వెళ్ళిపోయి క్రొత్తజైలరు వచ్చాడు. చాల మంచివాడు. ప్రజలుభారతఖయిదీలను స్వదేశానికి పంపాలని చేసిన ఆందోళనఫలితంగా కొంతమందిని బొంబాయికి బైంగాలీఖైదీలను బెంగాలుకు పంపారు. పంజాబీఖయిదీలను 'మహారాజా' అనేఓడలో 1921 ఆగస్టు 20 తేదీని ఎక్కించి

మాతృదేశానికి బయలుదేరదీశారు. పృథ్వీసింగ్ అతనితోడి ఖయిదీలు ఆత్మీయులైన 8 గురు దేశభక్తులను అండమాను దీవులకు బలియిచ్చి భారతదేశానికి చేరాడు.

## మదరాసుజైళ్ళప్రవాసం - పలాయనం.

ఓడ మద్రాసులో దిగ్గానే అందర్నీ మద్రాసు పెనిటెన్షరీజైలుకు తీసికెళ్ళి దళాలుగా విడదీసి ఒక్కొక్క దళాన్ని రాష్ట్రంలోని ఒక్కొక్కజైలుకు పంపాడు. పృథ్వీసింగు, ఖేర్‌సింగు, కుషన్‌సింగులను దళంగా చేర్చి రాజమండ్రిజైలుకు పంపనిశ్చయించి ఓనాడు ముగ్గురు హనుమ్మరావులంటి పోలీసులకాపలాతో కలకత్తామెయిలు ఎక్కించారు. పై ముగ్గురూ బలవంతులు. పోలీసులు ఉసుర్మియాలు. వాళ్ళకంట్లో దుమ్ముకొట్టడం సులభమే. మేకపిల్లలమాదిరి యీబలహీనులవెంట రాజమండ్రీపోవడంకంటె సిగ్గు వేరులేదని తలంచి తప్పించుకోడానికి అదును చూస్తున్నాడు.

అప్పటికి రాత్రి ఒంటిగంట దాటుతుంది. రైలు వంగోలుస్టేషనులో ఆగింది. వర్షం జోరుగా పడుతోంది. కారుచీకటి. కాపాలాపోలీసులు, ప్రయాణీకులుకూడా కునికిపాట్లు పడుతున్నారు. రైలు వంగోలుస్టేషను విడిచి స్పీడ్‌గా పోతోంది. పృథ్వీసింగుకాళ్ళకు సంకెళ్ళు వున్నాయి. బయట ఏముందో తెలియడం లేదు. దూకడానికి స్థిరపడుచుకున్నాడు.

ఏఅడ్డంకులూ స్వాతంత్ర్యేచ్ఛను నరికట్టలేవు. 'వందేమాతరం' అంటూ సంకెళ్ళతోసహా కిటికీలోనుంచి పరిగెత్తుతున్న మెయిలుబండినుంచి బయటకు దూకాడు. భూదేవివడిలో పడ్డాడు. ఎడమకాలు మోచిప్ప కొట్టుకుపోయి కీలు తొలిగింది. బలవంతుడుగనుక తట్టుకొని లేచాడు. సంకెళ్ళు తొలిగిపోయాయి. పోలీసులు బందీ తప్పించుకున్నాడని తెలిసి అలారంగొలుసు లాగితే రైలు ఆగింది. పృథ్వీసింగు దాన్ని చూచి పరుగెత్తడం మొదలెట్టి వెదికేవారికి కనుపించకుండా రక్కసపొదలో దూరాడు. ఒకపొదలోనుంచి యింకోపొదలోకిసాగిపోయాడు. రక్కసపొదల్లో ప్రాకడమంటే మహామొండితనం ఉండాలి. క్రమంగా పొదలుదాటి వరిచేలో చేరాడు. జోరున వర్షం. గాఢాంధకారం. ఎటుపోతూన్నదీ తెలియదు. పోలీసుల అరవులింకా వినిపిస్తున్నాయి. స్టేషనకు దూరంగాపోవడమే అతని లక్ష్యం. కొంతదూరం వెళ్ళాక చిన్నదీపం దగ్గఱగా ఉన్నట్టు తెలుస్తే దానికి సూటిగా పోయాడు. ఒంటినిండా గాయాలు, రక్కసముళ్ళు. ఆయాస మెచ్చింది. అదొకకుగ్రామం. ఆదీపమున్న దొక చిన్నగుడిసె. భార్యాభర్తలుకాబోలు యిద్దరు బయట పండుకొన్నారు. పేదలని తెలుస్తోంది. సింగ్ కదలికలో సంకెళ్ళు ధ్వనించాయి. స్త్రీ కళ్ళు తెరిచింది. పెద్దగడ్డం—ఒడలంతా రక్తం— భీకరస్వరూపం చూచి అరవబోతే పృథ్వీసింగ్ వద్దని సంజ్ఞ చేశాడు. నెమ్మదిగా భర్తను లేపింది. అతడు లేచి సింగురూపం చూచి దిగ్భ్రాంతుడయ్యా

డు. ఒకరిభాష ఒకరికిరాదు. సింగ్ ఏదో సాయమడిగాడు. కట్టుకోడానికి గుడ్డ యిమ్మన్నాడు. అతడు నిరుపేద అవడం చేత యివ్వలేకపోయాడు. ఆకలితో కడుపు దహించుకు పోతోంది. ఏమైనా పెట్టమన్న సింగుసంజ్ఞలు గ్రహించి ఆబీద సిగ్గుపడ్డాడు.

తెల్లవారుతోంది. ఆపేద సింగు నూరిబయట విడిస్తే రైల్వేస్టేషను చేరాడు. ఎండలో రైలుగట్టుమీద నిద్రపోతూంటే రైలుధ్వనికి మెలకువ వచ్చి తెనాలివేపు సాగాడు. చిన్నస్టేషను ఏదో వస్తే అక్కడిపోలీసుఏజంటు పిలిచి భోజనం పెట్టి పోలీసుస్టేషనుకు రిపోర్టు చేయగా పోలీసులొచ్చి అరెస్టని వంగోలు సబ్‌జైల్లో వుంచి గాయాలకు చికిత్స చేశారు. ఆస్పత్రిలో ఒంటిమీద రక్కసముళ్ళయినా తీయలేదు. వంగోలులోనే తప్పించుకున్న నేరవిచారణ జరిగింది. కోర్టుకు రానంటే బహిరంగప్రదేశంలోనే విచారించి డిఫెన్సు పెట్టుగోనంటే సంవత్సరం శిక్షవేసి యిద్దరుపోలీసుల కాపలాతో రాజమండ్రి జైలు కంపారు. సంకెళ్ళు వెయ్యకుండా అతనికి నమస్కరించి 'మేము పొట్టకూటకి పనిచేస్తున్నాము. మాకు చిక్కులు తేకం' డని బ్రతిమాలి రాజమండ్రి తెచ్చారు. దేశభక్తులు కొందరెదుర్కొని గోదావరిలో స్నానం చేయించి జైలధికారులకు వప్పగించారు.

ఇక్కడకూడా త్వరితంగానే పోరాట మారంభమైంది. జైలలోనే సింగ్ నిలబడక తిడితే తిరిగి తిట్టినందుకు కూనీ

కొట్టులో పెట్టమన్నాడు. అప్పుడొచ్చినా నిలబడక పద్మాసనంవేసి ధ్యానం చేసేవాడు. జైలరు ఎండలో నిలబెట్టమంటే వార్డర్లు అంగీకరించనందున తనకిష్టులైనవార్ని మద్రాసు రప్పించి తన్నమన్నాడు. పృథ్వీసింగ్ చావాలనుంటే రండని సవాలుచేస్తే తనే దొంగచాటుగా వచ్చి కర్రతో నెత్తిమీద కొట్టాడు. పృథ్వీసింగ్ దెబ్బతిన్న పులివలె జైలరుగొంతుకు పట్టుకుంటే గిజగిజ తన్నుకుంటూంటే వార్డర్లు విదిలించారు. తర్వాత ఎవ్వరూ సింగ్ జోలికి రాలేదు. పంజాబీబందీలు మరి కొందరొచ్చి పోరాటంలో కలిశారు. అన్నిమద్రాసుజైళ్ళ లోను జైలధికారులకు, లాహోరుబందీలకు పోరాటం సాగుతోంది. అప్పటిజాతీయపత్రికలు, ప్రజలు ఆందోళన చేయగా రాయబారులు విచారింపవచ్చి బందీలకు నచ్చజెప్పి శాంతింప జేశారు. పృథ్వీసిం గప్పటినుండి బందీలకు హిందీ నేర్పేవాడు. అప్పట్లో వందలాది సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్న రాజకీయబందీలు రాజమండ్రిజైలు కొచ్చారు. అందులో మహర్షి సాంబమూర్తి వగైరాలకు హిందీనేర్పటంవల్ల సింగుకు వారితో మైత్రి కలిసింది. ఆసమయంలోనే అల్లూరి సీతారామరాజు రంపపితూరీ దొరతనాన్ని హడలెత్తిస్తోంది. రాజమండ్రి జైలు కాదాడి వస్తుందనే వదంతి పుట్టగా అధికారులు గజగజలాడి బందోబస్తు చేసుగున్నారు. కాని అది వదంతే అయింది.

ప్రజాందోళన ఫలితంగా ప్రభుత్వం లాహోరుబందీలను ఉత్తరదేశపుజైళ్ళకు పంపనిర్ణయించి, పృథ్వీసింగ్, కర్తార్ సింగ్, రణధీరసింగులను నాగపూరుజైలుకు గొంపోవ 7 పోలీసులతో, ఒకయూరోపియన్ సార్జెంటుతో బయలుదేర దీసింది. బందీలకు సంకెళ్ళు వేయక జైలుదుస్తులు తీసేసి సింగ్‌దుస్తులిచ్చారు. రైలుమధ్యరాష్ట్రంలో ప్రవేశించేసరికి సింగ్ కిటికీప్రక్కన, రెండువైపులా పోలీసులు కూర్చున్నారు. వీళ్ళకు బుద్ధి చెప్పాలని సింగు కుతూహలపడి అర్ధరాత్రివేళ మరుగుదొడ్డిలో కెళ్ళాడు. దానికి చిన్నకిటికీ వుంది. అందు లోంచి నెమ్మదిగా బయటికి దూరి పరుగెత్తే రైలునుండి దూకి కాళ్ళమీద నిలబడగలిగాడు. అంచేతనే 'ధైర్యే సాహసే లక్ష్మీ' అన్నారు పెద్దలు.

౨

## స్వేచ్ఛా ప్రపంచం.

"కుసుమ గుచ్ఛంబునకుంబోలె పొసగు
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజనమస్తకప్రదేశమున నైన
వనమునందైన జీర్ణభావంబు గనుట"

పృథ్వీసింగ్ రెండోమారు స్వేచ్ఛాప్రపంచంలో పడ్డ రోజు 22–11–1922. వెంటనే రెండుమైళ్ళు పరిగెత్తాడు. ఓకంకరరోడ్డు చేరాడు. మైలురాయి, అమరావతి 2 మైళ్ళని వుంది. అరగంటలో అమరావతి చేరి ప్రక్కనేవున్న విద్యార్థి వసతిగృహందగ్గిర ఆగాడు. ఓవిద్యార్థిని కలిసి పట్టణంలో ఒకదేశభక్తు నిల్లు చేరాడు. ఆయనతో తనచరిత్రంతా చెపితే ఆదరించి ఖద్దరుబట్టలు, చెప్పులు కొనిస్తే వేషంమార్చి ఆయన కొనిచ్చిన రైలుటిక్కెట్టుతో ఉత్తరదేశం చేరి భారతదేశ మంతా పర్యటనం చేసి 18 ఏళ్లు రహస్యంగా గడిపాడు. పృథ్వీసింగ్ ప్రచ్ఛన్నజీవితఘట్టాలు చదివితే ఒడలు జలద రిస్తుంది.

అమరావతి దాటాక ఎన్నో విషమసంఘటనలు తప్పించుకొని చిన్నగాగుజరాతులోని కథియావాడ్ సంస్థానం చేరాడు. వెంట ఆత్మరక్షణార్థం కత్తి మాత్రమే ఉంచుకున్నాడు. ప్రవాస కాలంలో అతని కెంతమందో అనేకవిధాలసాయం చేశారు. కథియవాడుసంస్థానంలోని భావనగర్.లో ఉన్న ఒక హనుమద్భక్తుని సేవించి శిష్యుడై కాలం గడుపుతున్నాడు. సింగు నందరూ 'స్వామిజీ' అనేవారు. క్రమంగా స్వామీరావు అయ్యాడు. ఆహనుమదుపాసకుడు పృథ్వీసింగ్‌ను గౌరవిస్తూ సనాతనధర్మోన్నతపాఠశాలలో డ్రిల్లుమాస్టరుపనిప్పించాడు. సింగ్ బలంకలవాడేకాని వ్యాయామశిక్షణ తెలియదు. పిల్లలకు తాను కవాత్ నేర్పుతో బరోడావెళ్ళి మణిరావుజీ

వ్యాయామసదనంలో శిక్షణపొందివచ్చి నిపుణు డనిపించు కున్నాడు. బాలురను ప్రజాసేవకులుగ తరిఫీదు చేయుడమే అతని ఆదర్శం. బాలురకు బాలభటోద్యమంలో మంచిశిక్షణ యిస్తే వారు ప్రదర్శనాలకు వెళ్ళి వాలంటీర్లగా, పనిచేసేవారు. అందుచేత కథియవారుసంస్థానమంతా అతనిపేరు మ్రోగింది. అక్కడే భావనగర్ మహారాజా కృష్ణకుమార్ సింగ్ జీ పట్టాభి షేకోత్సవంలో బాలురు చేసిన ప్రదర్శనాలకు మెచ్చి యిచ్చిన స్థలంలో గదలతోను, లాఠీలతోను వినోదాలు నేర్పే మందిర మొకటి 'క్రీడామందిర' మనుపేర స్థాపించాడు.

## బర్మా ప్రయాణం

పృథ్వీసింగ్ రాజమండ్రిజైల్లో ఉండగా తండ్రి చూడా లని ముందు జాబురాసి వచ్చాడు. బంధువులచూసే సౌకర్యం ప్రభుత్వం.రద్దుచెయడంచేత వీలు లేకపోయింది. అప్పటినుండి తండ్రిని చూడాలనే కోరికచే 200 రు అప్పు చేసి బర్మా వెళ్ళి తండ్రికి పాదాభివందనం చేసి యుద్ధరంగానికి పోయేకొడుకును దీవించమన్నాడు. తండ్రి అంగీకరించాక తండ్రితో 'నేను దే శస్వాతంత్ర్యంకోసం పోరాడుతూ మరణించినా, రోగినై మర ణించినా నీకు తెలుస్తుంది. కాని యిలాగ రహస్యంగా దేశసేవ చేస్తుంటే తెలియదు' అని సెలవు తీసికొని వెళ్ళాడు.

పృథ్వీసింగ్‌కు విదేశసంచారవాంఛ తీరక చైనా పోవ ఒక కత్తి, ఓపిస్టల్, తూటాలు కొని దగ్గరుంచుకుని మోల్మేన్

వదలి నదిదాటి అరణ్యయానం సాగించాడు. దేనికీ వంగలేదు కాని మలేరియా కదలకుండా చేసింది. ఏలాగో ఒక టెలిగ్రాఫ్ కీపరింటికి చేరాడు. అతడు హిందువు. సింగ్ ముసల్మాన్ వేషం తో వున్నాడు. సింగ్ జ్వరతీవ్రతలో ప్రేలిన మాటలు విని దేశభక్తు డని గ్రహించి అతిథిశుశ్రూష చేశాడు. ముందు ప్రయాణం కష్టమని వెనక్కు వెళ్ళమని సలహా యిచ్చాడు. తిరిగి రంగూను వచ్చి కలకత్తాస్టీమరుకోసం చూస్తుండగా సి. ఐ. డీలు అనుమానించి ప్రశ్నలవర్షం కురిపించారు. ఏలాగో ఒక సి. ఐ. డీని వెంటబెట్టుకొని ఒకసందులో ప్రవేశించి రు 50 వాడిచేతిలో పెట్టి నీకు బ్రతుకుమీాద ఆశ ఉంటే ఇంతటితో నన్ను వదలమంటే కిక్కురుమనకుండా వెళ్ళాడు.

అక్కడ రైలెక్కి మాండలే చేరాడు. అక్కడనుంచి ఉత్తరబర్మాలో ఆఖరుస్టేషనయిన కింటిట్ చేరాడు. మణి పూర్ మిాదుగా భారతదేశం చేరనుద్దేశించి మణిపూర్ ప్రయా ణీకులతో స్నేహం చేశాడు. పర్మిట్ వుంటేనేగాని రాకూ డదు. పృథ్వీసింగ్ మణిపూరుదాకా మిత్రులకు ఖర్చులన్నీ తాను భరిస్తానని వప్పించి కొండదారిని బయలుదేరారు. త్రోవలో దొంగలబాధ తప్పింది. జ్వరం ప్రవేశించింది. ఆపై గుఱ్ఱాలమిాద కొంతదూరం ప్రయాణం చేసి మణిపూర్ చేరారు. అక్కడినుండి అస్సాం వెళ్ళడానికి పర్మిట్ ఉండాలి. అందుకు అస్సాంపోయే సర్కస్‌పనివాడితో స్నేహం కలిపి సర్కస్‌ముఠాతో అస్సాం చేరాడు. ఇక భావనగరం సులువు గానే చేరాడని చెప్పక్కర్లేదుగదా!

## భావనగరంలో పునఃప్రవేశం.

భావనగరంలో మామూలుగా వ్యాయామశిక్షణ మందిరం నడుపుతూ రాజపుత్రబోర్డింగ్ స్కూలులో డ్రిల్లు మాష్టరుగా చేరాడు. అంతలో 1928 లో కథియవాడ యువజనమహాసభ రాజకోటలో జవహర్ లాల్ నెహ్రూగారి అధ్యక్షతను జరిగబోతూంది. కథియవార్ యువకులంతా హాజరవుతారు. పృథ్వీసింగ్ తానుకూడా వెళ్ళ నుద్దేశించాడు. కాని రైల్లోపోతే చిక్కని మోటారుసోడ్డున సైకిలుమీద రాత్రి వేళ బయలుదేరాడు. మార్గం క్రొత్త. లైటులేదు. వందమైళ్లు పైగావుంది. ఉదయానికి చేరాలి. మహావేగంగా సైకిలు త్రొక్కుతున్నాడు. రోడ్డుప్రక్కనపోయే అడివిపంది సైకిలు పరుగుచూచి బెదరి సైకిలుప్రక్కనే పరుగెత్తడం మొదలెట్టింది. పృథ్వీసింగున్నూ బెదిరాడు. కాని యింకా స్పీడ్ ఎక్కించి త్రొక్కాడు. వరాహం వెనకబడ్డది. అతనికి అలసట వచ్చింది. దాహమవుతోంది. ఒకసాధువుగుడిసెలో గుక్కెడునీళ్ళు త్రాగాడు.

ఉదయానికి సభాప్రదేశం చేరుకొని రైల్లోవెళ్ళిన మిత్రుల్ని కలుసుకున్నాడు. బహిరంగసభలో శరీరవ్యాయామావశ్యకతను గురించి ఉపన్యసించాడు. ఈఉపన్యాసంతో కథియవార్ సంస్థానాలలోని యువకు లందరికీ పరిచయ మయ్యాడు. తర్వాత 'పోరుబందరు' లో సహశిష్యుని

యధ్యక్షతను సంస్థానప్రజల మహాసభ జరిగితే దానికి హాజరై శరీరవ్యాయామంపై తీర్మానం ప్రతిపాదించి నెగ్గించాడు. దాంతో కథియవారంతా శరీరవ్యాయామప్రవీణుడనే ఖ్యాతి వచ్చి ఆహ్వానా లన్నిమూలలనుంచి వచ్చాయి. ప్రచారం జోరుగా చేశాడు.

అంతలో 1930 వచ్చింది. మహాత్ముని దండీయాత్ర ప్రారంభం అరెస్టుకావడం జరిగింది. పృథ్వీసింగ్ కీవార్త తెలిసి ఉద్రిక్తుడై ఉన్నంతలో రాంపూర్‌నుంచి సత్యాగ్రహోద్యమంలో వాలంటీర్లను చేర్పించడానికి రమ్మని పిలిగా (?) వచ్చింది. భావనగరక్రీడామండలి వీడ్కోలు నందుకొని రాంపూరుకు రైలుబండి యెక్కాడు. అచట బ్రహ్మాండమైన ఎదుర్కోలుత్సవం యేర్పాటుచేస్తే మానిపించాడు. పృథ్వీసింగ్ శాంతంగా రైలుదిగటంతోనే మిత్రులు, మిత్రులతోపాటు పోలీసులూకూడా అహ్వానింప వచ్చారు. సబ్ ఇనస్పెక్టరు వచ్చి అరెస్టు చేశాడు. ప్రజలు మండిపోయి అల్లరిసాగింప దలుస్తే శాంతపరచి పోలీసుస్టేషనుకు ఇన్‌స్పెక్టరుతో వెళ్ళాడు. వాడిచేతిలో రివాల్వరుంది. వీడికంట్లో దుమ్ముకొట్టాలని ఆలోచిస్తున్నాడు. ఇద్దరూ ఓ వీధిచివరకొచ్చారు. కొద్దిదూరంలో మలుపు వస్తుంది. అప్పుడు పృథ్వీసింగ్ "సలాంసాహేబ్! మైజాతాహుం! (నేను సెలవుతీసుకుంటాను) అంటూ పరుగుమొదలెట్టాడు. ఇనస్పెక్టరు తెల్లమోహంవేసి నిలబడిపోయాడు.

ఇంతట్లోకే గాలి వాన వచ్చింది.. వేరుగ్రామం చేరి మిత్రునొకనిని కలిసి యతనితో గుఱ్ఱంమీద కొంతదూరం, ఎద్దుబండిమీద, కొంతదూరం కారుమీద పయనించి రైలు మీద అలహాబాద్‌వైపు వెళ్ళాడు. అక్కడ చంద్రశేఖర అజాద్ అనే టెరరిస్టుతో మైత్రి కుదిరింది. సాయుధప్రజా విప్లవమే స్వాతంత్ర్యసాధన మని ప్రబోధించా డతడు. పృథ్వీసింగును విదేశాలకెళ్ళి మార్క్సిస్టువిప్లవపుటెత్తులను నేర్చుకోమని అర్థించాడు. కొలదిరోజుల్లోనే అలహాబాదు పార్కులో పోలీసులు చుట్టుముట్టుతే అజాద్‌వారితో పోరాడి మరణించాడు.

ఆసమయంలోనే భగత్‌సింగు మున్నగు వీరత్రయాన్ని ఉరితీసినందుకు బొంబాయిలో ఎవరో కాల్పులవ్యతిరేకప్రదర్శనం చేసారు. పోలీసులు కొంతమంది నరెస్టుచేసి కేసుపెట్టి అందులో స్వామీరావునుకూడ ఇరికించారు. పారిపోయిన స్వామీరావును పట్టుకుంటే రు 500 లు. యిస్తామని యతనిఫొటోలు తీసి దేశమంతా ప్రదర్శించారు. ఒకనాడు రైలుప్రయాణం చేస్తూంటే సి. ఐ. డి. ఒకడు గుర్తించి ఆ పెట్టెలో ప్యాసంజర్లను దింపేసి పట్టుకొనుటకు అదనపుపోలీసులను తెచ్చాడు. స్వామీరావుకోటుజేబులో రివాల్వరుంది. సిగ్నలివ్వనందున రైలాగితే ధైర్యంగాదిగి వెళ్ళిపోయాడు. పోలీసులకు గుండెలుచాలక వెఱ్ఱిచూపులతో నిలబడ్డారు. ఆ వెళ్ళడం 80 మైళ్ళు నడచి ఓమిత్రుని కలిసాడు. కాని

స్వామీరావుపేరు బహిరంగమైంది. కనుక ప్లేటు మార్చాలని విదేశాల కెళ్ళాలని ఆలోచిస్తున్నాడు. అప్పటికి 1931 లో కాంగ్రెసుమహాసభ కరాచీలో జరుగుతోంది.

అందుకోసం సాధువేషం దాల్చటమే గత్యంతరమని కాషాయవస్త్రాలు కట్టాడు. పావుకోళ్ళు తొడిగాడు. ఆరావళీ పర్వతాలగుండా రాజపుటానాపుణ్యక్షేత్రాలను చూస్తూ ఆబూపర్వతమెక్కి హల్దీఘాటు చేరాడు. త్రోవలో చాలా మంది సిద్ధులతో సంబంధం కలిసిందకాని వాళ్ళంతా నల్ల మందుభాయీలని పసిగట్టి విడిచి క్రమంగా కరాచీ జేరు కున్నాడు. సాధువేషం విడచి సామాన్యదుస్తులతో కాంగ్రెసు మహాసభకు వచ్చిన జనసమర్దంలో లీనమయ్యాడు. అచట 'గురుముఖసింగు' అనే విప్లవకారునితో స్నేహం కుదిరింది. అతడుకూడా విదేశసంచారం కోరుతున్నాడు. ఆతనితో గలిసి రష్యాకు వెళ్ళాలని యిద్దరూ విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

భారతదేశం వీడి విదేశాలకు వెళ్ళదలచిన విప్లవకా రులకష్టాల కంతుండదు. సరిహద్దులలో కాపలా, తణిఖీలు. అందుచే రహదారీమార్గాలగుండా మాని పర్వతాలు, అర ణ్యాలమార్గాన్ని పృథ్వీసింగు బయలుదేరి తొందరగా భారత దేశపుసరిహద్దులను దాటాడు. ఒకపర్వతంమీద 'హాష్‌గుల్' అనే మసూద్‌నాయకుడు కలిస్తే యతన్ని కాబూలుచేర డానికి సాయంచెయ్యమన్నాడు. అతడు వెంట పంపిన మనిషి

ఢక్కా-వజుకు సాగనంపి వెనుదిరిగాడు. అక్కడనుండి బస్సు మీద 'జల్లాబాద్' అనే పట్టణం చేరి గవర్నరును కలుసుకుంటే అరెస్టుచేసి పొలిటికల్ డిపార్టుమెంటుకు అప్పగించాడు. ఆగవర్నరు సోదాప్రశ్నలు వేస్తే తాను ముహాజరిన్ అనీ, పేరు మహమ్మదాలీ అనీ, ఆఫ్ఘనిస్థానంలో ముస్లిమ్ రాజ్యంలో నివసింప వచ్చానని తెలిపాడు. తుదకు కాబూలు పంపమని ఆర్డరు పడింది. కాబూలు వెళ్ళడానికి తనవెంట వచ్చిన ముస్లిమ్‌తో గజ్నీపట్టణం చేరాడు. అక్కడనుంచి బస్సుల్లో కాందహార్ వెళ్ళాడు. తర్వాత కాబూలుచేరి 20 రోజులలో రష్యాసరిహద్దునవున్న హీరట్‌నగరం చేరుకున్నాడు. అక్కడిగవర్నరు యిద్దర్నీ అరెస్టుచేసి జైల్లో పెట్టాడు. ఆముస్లిమ్‌నకు పలుకుబడిగల బంధువులుండి విడుదలఆర్డరు తెచ్చాడు. ఆ ఆర్డరు చూపిస్తే చదువురాని కావలావాడు యిద్దర్నీ వదిలేశాడు. అక్కడనుంచి కాలినడకనే రష్యావైపుకు పయనం సాగించాడు. డబ్బుందికాని ఆహారం లేదు. దారిలో ఎన్నో చిక్కులు పడ్డాడు. యజమానినుండి తప్పించుకొన్న ఒంటెను యజమాని కప్పగిస్తే అతడు గౌరవించి నీప్రయాణాని కీఒంటెనుపయోగించుకోమని యిస్తే వద్దన్నాడు. పృథ్వీసింగుకు అతడే సోవియట్-ఆఫ్ఘన్ సరిహద్దుల వివరాలను చెప్పి సరిహద్దులో వున్ననదిని అనుమతి లేకుండా దాటితే కావలావాళ్ళు కాలుస్తారని విన్నవించి తనత్రోవని పోయాడు. పృథ్వీసింగు పొదలమాటున దాగి నదియొడ్డుకు

చేరి నీరు లోతుగా లేనందున ఒక్కపరుగులో అవతలఒడ్డుకు జేరుకున్నాడు. 1931 జులై 28 వ తేదీని తనచిరకాలవాంఛితమైన సోవియట్ భూమిలో ప్రమాదం లేకుండా నిర్భయంగా పాదం మోపాడు.

## సోవియట్ సంచారం

పృథ్వీసింగు సరాసరి కస్టమ్సుఆఫీసువద్దకు చేరి అక్కడున్న రక్షకభటుని ఆఫీసరుదగ్గఱకు తీసికెళ్ళమన్నాడు. ఆతడు నువెవ్వరవని ప్రశ్నిస్తే పర్షియాభాషలో తాను భారత దేశవిప్లవకారుడనని చెప్పిన మరుక్షణంలో ఆఫీసరుదర్శనం కావడం, మాటలాడడం, ఆహారమివ్వడం జరిగిందికాని స్పెషల్ బ్రాంచిపోలీసు లొచ్చి పరీక్షించి జైల్లో వుంచారు. తర్వాత అమెరికాలోని సోవియట్ రాయబారిద్వారా తెలుసుకొని విడిచేయడమే కాకుండా స్వైరవిహారానుకూలత ఏర్పడింది. అక్కడనుండి ప్రపంచవిప్లవకారుల కాశాజ్యోతియైన మాస్కోకు వెళ్ళాడు. ఎక్కడైతేనేమి సోవియట్ భూమిలో 1931 జులై నుండి 1933 జూనువఱకు ఉన్నాడు. ఆదేశ స్వేచ్ఛాజీవులను జూస్తూంటే తనమాతృదేశకష్టాలు కండ్లకు కట్టి అవకాశాలన్నీ వదలుకొని మాతృదేశానికి ప్రయాణమయ్యాడు.

ఉద్రేకజనితకార్యాలు చేయడమంటే యువకులకు సంతోషం, అందులో మాతృదేశశృంఖలాలను విడగొట్టడం

సామాన్యకార్యమా? పృథ్వీసింగ్ గురుముఖుసింగులు భారత దేశంలో బహిరంగంగా అడుగుపెట్టరాదు. కాన నిర్జన మైన అఫ్ఘనుపర్వతమార్గాన బయలుదేరి తోవలో భారత దేశానికి రహస్యంగా రాగోరే హుకుంసింగును కలిశారు. ఆ ముగ్గురూ త్రోవలో నదీప్రవాహాలను గుఱ్ఱాలతోకూడదాటి ఒకలోయగుండా వస్తూంటే పోలీసులు చుట్టిముట్టి ప్యాస్ పోర్టులేనందున అరెస్టుచేసి ఖానాబాద్ గవర్నరువద్దకు పం పితే అచ్చట హుకుంసింగు మిత్రుడొకడు జామీనిచ్చి విడి పించాడు. అక్కడనుంచి బయటపడి 48 గంటలు విశ్రాంతి లేకుండా ప్రయాణంచేసి భారతదేశపుసరిహద్దులను సమీ పింపబోతున్నారు. ఇక రెండుగంటలప్రయాణం. అంతలో వారి దురదృష్టరేఖ బయటపడి సరిహద్దుపోలీసులు పట్టి అరెస్టుచేసి ఖయిదు చేశారు. ఆజైలుకు మామాఖేలు అని పేరు. అక్కడనుంచి కాబూలుకు బదలాయించారు. ఆకట్టు దిట్టాలు వ్రాయలేము.

ఆతర్వాత నాలుగురోజులకు అఫ్ఘనుయువకు డొకడు బ్రిటిషురాయబారికార్యాలయంపై కాల్పు చేశాడు. దాంతో ప్రభుత్వం ఖయిదీలకు కాళ్ళుకు ముడిపెట్టి యెన్నోవిధాల బాధించి హింసలు పెట్టింది. అందుచే నిరశనవ్రత మారం భించారు. ఏంలాభం. బ్రిటిషుప్రభుత్వం చలించలేదు. అందు వల్ల ఉపవాసం మానివేశారు. తర్వాత ఏవేవోగందరగోళాలు జరిగాయి. ఆసంగతి రష్యాకు తెలిసి మనదేశభక్తుల నిర్ద

రినీ విడిపించింది. పృథ్వీసింగు ప్యాసుపోర్టు లేకుండానే చాలా తెలివిగా భారతదేశం చేరుకొని బెంగుళూరులో కొంతకాలం చౌకీదారుగాను, సేల్స్‌మన్‌గానూ, ట్రావిలింగు ఏజంటుగాను పనిచేస్తూ రహస్యజీవితం గడుపుతుండేవాడు. ఈవిధంగా 16 ఏళ్ళు పోలీసులకళ్ళలో దుమ్ముకొట్టి వాళ్ళతోనే వ్యవహారాలు సాగించాడు.

1938 లో ఏడురాష్ట్రాలలో కాంగ్రెసుమంత్రులు పరిపాలన సాగిస్తున్నారు. ఆసమయంలో పృథ్వీసింగుకు రహస్యజీవితమంటే విరక్తి కలిగి గాంధీమహాత్ముని దర్శించి తనగాథను, చెప్పేసరికి పట్టుబడి పనిచెయ్యమని సలహా యిచ్చాడు. వెంటనే తనంతట తాను వెళ్ళి బొంబాయిలో అరెస్టయాడు. అక్కడికి అతనిసోదరుటు బర్మానుండి చూడవచ్చారు. తండ్రీ మరణవార్త వారివల్ల తెలిసింది. గాంధీజీ పృథ్వీసింగువిడుదల కెంతో యత్నించగా ఫలించి 1939 సెప్టెంబరులో విడిచిపెట్టారు. కొంతకాలం అక్కడేవుండి అహింసాసిద్ధాంతాల నాచరణలో పెట్టుటకు కృషి చేశాడు. ఏంలాభం-మహాత్మునకు, పృథ్వీసింగుకు మనోభేదాలు వచ్చాయి. వాటి కన్నిటికీ అప్పటి యూరపుయుద్ధకలాపాలే కారణం. 1942 ఆగస్టులో కాంగ్రెసునాయకులను హఠాత్తుగా బ్రిటిషుప్రభుత్వం జైళ్లలో తోసింది. అందులో పృథ్వీసింగు ఒకడు. అతడు బందిఖానాలోనుండే పోరాట మారంభించాడు. 1943 లో పృథ్వీసింగు విడుదల జరిగింది. తిరిగి దేశసేవ కుపక్రమించి

వ్యాయామమండలిలో పనిచేయుచుండగా ప్రభావతీదేవియను ఒకగుజరాతీయువతితో పరిచయ మేర్పడి వారిరువురు 1943 అక్టోబరులో దంపతు లయ్యారు.

1943–44 మధ్య ఆకలిమంటలతో నిండి కరువుకాటకాలతో క్షోభించే తెనుగుదేశానికి పృథ్వీసింగు సంచారం వచ్చి ముఖ్యపట్టణాలన్నీ తిరిగి వ్యాయామవిషయకమైన ఉపన్యాసములిచ్చి బెంగాలుకరువునిధికి డబ్బు వసూలు చేసి పంపాడు. ఈవిధంగా భారతమాత పుత్రరత్నమైన పృథ్వీసింగు తనజీవితాన్ని మాతృదేశానికి అంకితం చేశాడు. ఆవిప్లవవీరునకు ఆభారతవిపవయోధునకు ధన్యవాదాలు.

జై హింద్!

బాళన్ప్రెస్, రాజమండ్రి Q. H. E. G. 3.
కాపీలు 1000. 13—5—46

రాబోవు భారత విప్లవవీర—

వీరనారీమణుల జీవితములు.

శ్రీ జయప్రకాశ నారాయణ

శ్రీ అచ్యుతపట్వర్ధన్

శ్రీ యూసఫ్ మెహరాలీ

శ్రీ భగత్సింగ్

శ్రీమతి అరుణ అసఫాలీ

శ్రీమతి కమలాదేవి

శ్రీమతి ఉషామెహతా

శ్రీమతి కెప్టెన్ లక్ష్మి

వలయువారు: —

శాస్త్రి అండ్ కో.,

రాజమండ్రి.